# లోకశాంతి

## నాటకం —

(ఉద్రేక రసప్రధానము)

వడ్డాది బి. కూర్మనాథ్



యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం : : మద్రాసు : : సికిందరాబాద్
వెల : రూ 1_25

F/9
మొదటిముద్రణ
అక్టోబరు, 1960




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సువారి
'ఇంటింటా స్వంతగ్రంథాలయం' ప్రణాళిక
చందాదారులకొఱకు ప్రత్యేక ప్రచురణ

హిందూప్రెస్
మచిలీపట్నము

# తొ లి ప లు కు

లోకశాంతి నాటకాన్ని వ్రాయడంలో నా ముఖ్యాభిప్రాయాన్ని చెప్పక తప్పదు. ఈనాడు వెలువడుతున్న సాంఘిక నాటకాల నన్నిటినీ గమనిస్తున్నాను. అన్ని నాటకాలుకూడ జరిగిన విషయాలనుగురించి, జరుగుతున్న విషయాలను గురించి వ్రాయబడ్డాయి. కాని జరుగబోయే విషయాన్ని గుర్తుకుతెచ్చి చిత్రించి, ప్రజలను హెచ్చరించే నాటకం ఒక్కటీ లేదు. ఈ హెచ్చరిక నామూలంగా మొట్టమొదటిసారి జరుగుతూందని నేను అనుకుంటున్నా. అయితే ఇట్లా భవిష్యత్తును వూహించి వ్రాయడం నాటక లక్షణమా అని మీరు అనవచ్చు. కావ్యాలలో నాటకం రమ్యమైంది గనుక రామాయణాది కావ్యాలు భవిష్యత్తునూహించే వ్రాయబడ్డాయి గనుక దోషం లేదని అంటాను. అలాగే యీ లోకశాంతి భవిష్యత్తును వూహించి వ్రాయబడిన నాటకం.

ఈ నాటకంలో నేనూహించిన భవిష్యత్పరిణామము లేమిటి ?

(1) ప్రజాస్వామ్యాన్ని ప్రజలకున్న సహజమైన స్వేచ్ఛను వశింపజేసే ఒక భయంకర నియంతృత్వవ్యవస్థ ఎలా

ప్రజలను మోసపుచ్చి తన హయాం వెలిగిస్తుందో – దానికి ప్రజలు ఎలా బుద్ధిచెప్తారో వూహించి చిత్రించాను.

(2) సంఘంలో అతిప్రధానమైన పాత్ర స్త్రీ. స్త్రీలలో ప్రకృతిసహజమైన అబలత్వాన్ని ఆధారంగా తీసికొని పురుషులు స్త్రీస్వాతంత్ర్యం, సమానహక్కులు అన్నే వల్లో బంధించి ఎలా బాధిస్తారో చిత్రించాను.

(3) భౌతికవిజ్ఞానం ప్రపంచాన్ని ఎలా సర్వనాశనం చేస్తుందో, దానిపై ఆధ్యాత్మిక, అధిభౌతిక ప్రభావం ఎలా విజయాన్ని పొందుతుందో చిత్రించాను.

ప్రస్తుతం నా దృష్టి గోచరమైన యీ ప్రమాదాలను గమనించడం అవసరమని ప్రజలను హెచ్చరిస్తూ వూహించి వ్రాసిన, యీ భవిష్యపురాణాన్ని లోకశాంతి నాటకంగా చిత్రించాను. దీనిని చదివి, ప్రదర్శించి తమ, తమ అభిప్రాయాలను నాకుగాని "శ్రీ శేషాచలం అండు కో" వారికిగాని తెలియజేస్తారని ఆశిస్తున్నా.

ఈ నాటకాన్ని "ఉద్రేక రసప్రధానం" అని వ్రాశాను. ఉద్రేకం అనేది ఒక రసంకాదని కావ్యాలంకార గ్రంథాలు చదివిన పెద్దలు చెప్తారు. కాని, నేను దానికి వ్యతిరేకిని. ఎందుచేతనంటారా? సమస్త ప్రపంచానికి మూలకారణం పరమాత్మ ఎలాగైతే వున్నాడని అంటున్నారో

అల్లాగే నవరసాలకు మూలకారణమైన ఆత్మప్రేరణ ఒక టున్నదనీ, అదిలేనిదే ఏ రసమూ ఉత్పన్నముకాదని నా అభిప్రాయం. దీన్నే "Mood" అంటారు ఇంగ్లీషులో. ఆత్మ ప్రేరణ అంటే హృదయంలోంచి పొంగే వుద్రేకము. పొంగి వచ్చే భావతరంగం. ఉద్రేకము ఒక మేఘమాలికవంటిది. ఆ మేఘం ఝుంఝూమారుతాలవల్ల పైకిలేచి వర్షిస్తేనే ప్రపంచం రసమయం అవుతుంది. మేఘం రసనహం అవడం చేత వుద్రేకంకూడా రసమనే చెప్పవచ్చు. ఈవిధంగా స్వతంత్రించి వ్యాఖ్యానం చేసినందుకు పండితులు మన్నిస్తారని, గ్రహిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,

వడ్డాది.



# పాత్రలు :—

## పురుషులు

1. సత్యం— 40 సం॥ ... తాలూకాఆఫీసు గుమాస్తా. సామాన్య సంసారి. సంసార సాధకబాధకాలతో సతమతమౌతున్న వ్యక్తి. ఉద్రేకి... సెన్సిట్యువిట్.

2. డిక్టేటర్— 40 సం॥ ప్రభుత్వమే ప్రజలకు కావలసిన ఆర్థిక, రాజకీయ, సాంఘిక అవసరాలను నిర్ణయించే అధికారం కలిగివుండాలనీ, ప్రజలందరూ తప్పనిసరిగా ప్రభుత్వానికి లొంగితీరాలనే ఒకతరహా ప్రభుత్వాధినేత. ఉద్రేకి. విజ్ఞాని.

3. 1 వ యువకుడు (కామ్రేడ్)— పై డిక్టేటరు భావాలనే కలిగి ఆదేశకార్యసిద్ధికి కృషిచేసే డిక్టేటర్ ముఠాలోవాడు. ఉద్రేకి... విద్యావంతుడు. (25 సం॥)

4. సుందరం— ఆధునికయుగంలో సనాతన భావాలకు విలువనిచ్చే విద్యావంతుడు. ఉద్రేకి...వయస్సు 40 సం॥

5. భూపేంద్రుడు— పెట్టుబడిదారు. పెట్టుబడిదారీ విధానం నశించేకాలంలోనివాడు. వయస్సు...50 సం॥

6. కార్మికుడు—
7. కర్షకుడు —

} డిక్టేటరు పరిపాలన రాకముందు, ముఠాల ప్రచారానికి లోబడి ఏవేవో కలలుగని, తీరా ఆపరిపాలన వచ్చినతరువాత వారికి కలిగిన అన్యాయానికి బానిసత్వానికి, విస్మయులై, అసంతృప్తిని ప్రకటించి తిరుగుబాటుచేసిన ప్రజానీకానికి చెందినవారు. ఉద్రేకులు...వయస్సు...50, 30 సం॥

8. విశ్వపతి— 10 సం॥ కుర్రవాడు...కర్షకుని తమ్ముని కుమారుడు ...ఉద్రేకి...

9. వీరయ్య— కర్షకుని అల్లుడు...25 సం॥... డిక్టేటరు పరిపాలన లోని కార్మికుడు...నాటి పరిపాలనావిధానానికి గురియై భార్యా వియోగంతో, నిరాశితుడై మతిచెడిన హృద్రోగి ... ఉద్రేకి...

10. కవి, సైంటిస్టు, పత్రికా నిర్వాహకుడు, ఆర్టిస్టు — వీరు యుక్తవయస్కులుగాగాని, అంతకుమించినవయస్సు గల వారుగాగాని యుండవలెను. నవనాగరిక యుగంలో ప్రజానీకానికి వారిమూలంగా కలిగినహానిని గురించి పశ్చాత్తప్తులై డిక్టేటరుని ఎదిరించి లోకశాంతికరమైన వ్యవస్థను నిర్మించాలనే మహాత్ములతో ఏకీభవించిన మేధావులు...

11. నర్సయ్య— వృద్ధుడు... తహశీల్దారు ఆఫీసులో బంట్రోతు.

## స్త్రీలు

1. గౌరి— 25 సం॥ ... సత్యంభార్య. సనాతన భావాలయందు నమ్మకం కలది. ఉద్రేకి.

2. సరోజ–స్వేచ్ఛ— 30 సం॥ మొదట సనాతన భావాలుగల సరోజగావుండి... రానురాను నవనాగరికా వలయంలో చిక్కుకొని పతితురాలైన స్త్రీ. గ్రేడ్యుయేట్.

3. లక్ష్మి— భూపేంద్రునిభార్య. ధనానికి ప్రతినిధిగా నియమించిన పాత్ర.

# లోకశాంతి

## 1-వ రంగం

[ సామాన్య సంసారుల గృహంలో ఒకగది. వీధివైపునను లోనికి ద్వారములుండును. రెండు సాధారణ కుర్చీలు, చేతులుగల పడక కుర్చీ, టేబిలు, దానిపైకొన్ని పుస్తకములు, నూనెసీసా, ఆముదం సీసా, న్యూసు పేపర్లు, దండెమున మాసిన గుడ్డలు, నులకమంచం, గోడలకు కొన్ని చిత్రరువులు, అన్నీ చిందరవందరగా వుంటాయి.

సత్యం పడకకుర్చీలో కూర్చుని, తన చుట్టూ కుప్పలా ఆఫీసుఫైల్సు పెట్టుకొని, కుర్చీహేండ్సుపై బల్లనుంచి, దానిపైనున్న ఫైల్సుని చూస్తూ ఏదో వ్రాస్తూవుంటాడు. అతని జుత్తురేగి, ముఖం చిరాకుగా వుంటుంది. ]

సత్యం.— (అంకెలు కూడుతూ మొత్తం తప్పురాగానే) ఇస్, (అని నిట్టూర్చుచూ బుర్రపట్టుకొని, మరల కూడుచూ ఎకౌంటు టేలీకాకపోగా, చిరాకుతో బుర్రపట్టుకొని) రామచంద్రా! (అంటూ నడ్డివాలుస్తాడు.)

నర్సయ్య.— (ప్రవేశం) దండాలు బాబయ్యా!

సత్యం.— ఏం నర్సయ్యా? (అని ఆత్రంగా అడుగుతాడు)

నర్స.— ఏముంది బాబూ! R. D. O. వస్తారట. తాసిల్దారు గారు బేగిరమ్మన్నిశలవైంది.

గౌరి.– (ప్రవేశం. రేగినజుత్తు – చెమటకు తడిసిన కుంకుమ, నిప్పుసెగతగిలి కందిన ముఖంతో, గరిటె చేత్తోపట్టుకొని) అబ్బబ్బ! చూసేరా ఆ గుంట వెధవ? వాడినేమీ అన కూడదంటారు. వాడుచూస్తే రావణాపని చేస్తున్నాడు. ఆ యిన్ని బియ్యమూ వండి అక్కడపెడితే దానినిండా బుట్టెడుముగ్గూ దిమ్మరించేడు. మీరు చూస్తే ఇంటివద్ద నున్న కాస్సేపూ, మంచీ, చెడ్డా అనరు. అస్తమానం ఆఫీసుపనితో దేవులాడుతూవుంటే నేనొక్కర్తెనూ ఎలా తగలడేది? (నర్సయ్యను చూసి) అయినా అదేం ఆఫీసరమ్మా! ఆ యమధర్మరాజైనా ఓ ఘడియ ఆగు తాడుగాని, మీ ఆఫీసరు ఆగేటట్టులేదు. తెల్లవారే సరికల్లా పీకలమీదకి హవాలయితే, యీ గుమస్తాల సంసారా లెలాగడుస్తాయ్? (దండం పెడుతూ) బాబోయ్! ఇలాగైతే నేనీ సంసారం ఒక్కక్షణం చెయ్యలేను. ఇదిగో! మీరోసారివచ్చి ఆ గుంటవెధవని తీస్తేనే వంటయ్యేది. లేకపోతే పొయిలో నీళ్ళుపోసి చక్కా వచ్చేస్తాను.

సత్యం.– (విసుగుతో నీరసంగా) రామచంద్రా! ఏమిజీవితంరా బాబూ! (అంటూ బల్ల ప్రక్కకుతప్పించి నెమ్మదిగా లేస్తాడు)

గౌరి.– భోజనంచేసి వస్తారులేనాయనా! వెళ్ళు. ఆ తలుపు గడియపెట్టి వేగిరం రండి.

నర్స.– (నెమ్మదిగా) సెలవండి బాబయ్యా! (నిష్క్రమిస్తాడు)

వీధిలోంచి బిచ్చగాడు. "ఏమిసౌఖ్యం ? ఏమి సంపదలూ? యీ మాయలోకం !" ......... (అని పాడుతూ) "బాబయ్యా !"

సత్యం.– (చిరాకుగా) వెళ్ళరా నాయినా!

బిచ్చ.– ఎవరూ వుండేది లేదు, అందరూ పోయేవాళ్ళే!

సత్యం.– (కోపంతో) ముష్టివెధవకి యీ వేలాపన ఏంటి ? ఛా! ఛా! (అంటూ తలుపుగడియవెయ్యగా)

("దబీ దబీ" మని తలుపు బిద్దలయేలా ఎవరో తడతారు)

సత్యం.– ఎవరది ?

వీధిలోంచి.– నేనూ

సత్యం.– అంటే ...

వీధి.– నేనయ్యా.

సత్యం.– (గడియతీస్తాడు.)

కోమటి.– (టపీమని తలుపుతోసుకొని ప్రవేశం.)

సత్యం.– (తత్తరపాటుతో) ఓ ... నమస్తే! మీరా ?

కోమటి.– (హేళనగా) నమస్తే! ... ఎందుకూ నమస్తే? ... ఏమయ్యో? వచ్చినప్పుడు నమస్తే — వెళ్ళినప్పుడు నమస్తే — మా డబ్బుకి వస్తే! ఇదేవేళాకోళమా ? శ్రీకాకోళమా ? ... ఎప్పుడొచ్చినా ఇంటివద్ద లేరని చెప్పడమే. వున్నప్పుడొస్తే నమస్తేలు పెట్టడం... వారెవా! ... మీ తంత్రాలు మాదగ్గిర పనికిరావం

పోయ్ ! తే! తే! మాబాకీ తేవయ్యా ! ... నాలుగు మాసాలైంది.

సత్యం.– (వినయంగా) ఇచ్చేస్తానయ్యా! ఎందుకలా బాధ పెడతారు ? నెలాఖరుముందు మా దగ్గిర ఒక్కదమ్మిడీ కూడా వుండదు. నన్ను చంపేసినా దగ్గిర దమ్మిడీ లేదు. ఫస్టుతారీకు రాంగానే మీడబ్బు మీకిచ్చేస్తాం.

కోపం.– (కోపంగా) ఫస్టు ! ... ముఖానికి సిగ్గేనా లేదా ? నాల్గుమాసాలై ఇట్టి చంపుతున్నావ్. ఫస్టునొస్తే లాస్టు, లాస్టునొస్తే ఫస్టు...రెస్టులేకుండా ముష్టి వెధవల్ని త్రిప్పినట్లు త్రిప్పుతున్నావ్...అన్నం తింటున్నావా ? గడ్డి తింటున్నావా ? ... పూరిబాబుగాడి సొమ్ముతినేసి వుద్యోగాలు చేయడానికయ్యా ! మీరు సదివిన సదువులు? ఛీ ! ... వెధవబ్రతుకులు బ్రతికేరు...ముఖాన్ని వ్రాసేస్తున్నా సిగ్గులేదు.

గౌరి.– (ఇంతలో వచ్చి) శెట్టిగారూ! మీ రిన్నిమాట్లు చెప్పాలా ? అదేం రోజులోగాని నేటికి ఆరుమాసాలైంది. ఇన్ని చికాకులే. అంత అన్నంతింటే మీ ముఖం గానక పోతాం. ఆయన తమ్ముడిగార్కి పెళ్ళంటే, ఆరువంద లప్పుచేసేం. ఆ సంవత్సరమే తోటి కోడల్ని నోముకు తీసుకొనివచ్చి ఆరుతులాల బంగారం పెట్టేం. ఇంకా ...

శెట్టి.– (మధ్యలో) ఆగండమ్మా ! ఆగండి. ఇంక మీవన్నీ ఖర్చులు మావన్నీ జమ లనుకున్నారేమో ! మాబాధలు మీకేం తెలుస్తాయ్ ? ఏపారానికి డబ్బు చాలకపోతే

ఇరవై వేల రూపాయిలకి ఇల్లమ్మేశాము. కొత్తకోడలికి నంపతులాల బంగారం కొన్నాం. అదీ ఇదీ అంతా కలిపి సవారంమీద పెట్టుబడి పెట్టేశాం. నాభి కొనుక్కోడాని కైనా నాల్గు డబ్బులు లేవు. వున్నకాడికి సామానంతా బకాయివాళ్ళందరికీ బాకీలిచ్చేసేం. నాల్గు నెల్లె కాళ్ళరిగేలా తిరుగుతున్నాం బాకీకోసం. అతీ లేదు గతీ లేదు. అంతులేకుండా అడవు వాడుకుంటారాయె. అహాహా! ఏంగువమాస్త్రాలా బాబూ! అడవిస్తే ఏనుగునే కొనేస్తారు. ఇదేటమ్మాయ్ మొగాళ్ళప్పు లేడం, ఆడోళ్ళు సమాధానం చెప్పడమూనా? బలే తర్భిదే! ఏమయ్యా! అలా వూరుకుంటావేం?

సత్యం.—వూరుకోక ఏంచేసేది? చేతిలో దమ్మిడీ లేదన్నా నినవాయె. మా ఆవిడ చెబుతున్నాదిగా సమాధానం. ఎంతసేపు చెప్పినా అంతే...

శెట్టి.— ఎంతసేపు చెప్పినా అంతే? ... బలే మొండివాళ్ళే! ఆ కాస్త పరువూ వీధిని పెట్టే వరకూ యీ నాటకాలు. హుం! ... ఏమయ్యా! ఇంటికొచ్చిన ప్రతీ అప్పులాడికీ ఇలాగే వప్పచెబుతున్నావా? నీ పెళ్ళాన్ని సమాధానం చెప్పడానికి.

సత్యం.— (కోపంగా) ఆగు. నోటికొచ్చినట్టూ పేల్తున్నావ్!

శెట్టి.— మా డబ్బు మాకిచ్చి, అంత పౌరుషముంటే.

సత్యం.— ఇవ్వకపోతే నోటికొచ్చినట్లూ కూస్తావా?

శెట్టి.– అనరూ ? అంటారా, అని చూస్తారా ?

సత్యం.– ఆ ! ఇస్తాలే ... ముందు గుమ్మందగ్గి మాట్లాకు. ఊ ! ... పోవేం ? ... (అని మెడపట్టుకుని తోసేసి గడియపెట్టి) నీ డబ్బు రావాల్సివుంటే దావా తెచ్చుకో.

శెట్టి.– (పైకిలేంచి) సరే ! ఎలారాదో చూస్తాగా ! నడివీధిలో నిలబెట్టి పరువు తియ్యకపోతే వొట్టు...

సత్యం.– ఓ ! చూసేంలేవోయ్ ! వెళ్ళు ! వెళ్ళు ! (అని గౌరినిచూచి) ఇంటిదగ్గిరుంటే యీ బాధ, ఆఫీసుకెళ్తే ఆ బాధ. ఇంక నే నెక్కడికి పోయేది ? ఇక నావల్లకాదు. నే ని సంసారం ఒక్కక్షణంకూడా చెయ్యలేను. మీ రందరూ నా పాలిట యమదూతల్లా పోగయేరు. మీ అందర్నీ మేపడానికి నా కింక శక్తిలేదు. పొండి !

గౌరి.– బాగానేవుంది... మాటాడితే కస్సూ, బుస్సూ – ఇదొకటి బాగా చేతనైంది. మాటాడితే మా మీద పడి పోతారేం ? మాకేం పెట్టేశారు ? వున్నకాడికి చీర లన్నీ మా పుట్టింటారే పెట్టేరు. పదితులాల బంగారంతో కన్యాదానంచేసి యింత సుఖపడమన్నారు. పట్టెడు మెతుకులు పెట్టడానికేనా మీ కింత కష్టం ? తమ్ముడి పెళ్ళికని ఆరువందల రూపాయలు 'బేంకులో అప్పుచేసే రాయె... తమ్ముడి పెళ్ళానికని నా వంటినున్న బంగారం ఇచ్చేసేరాయె... (ఏడుస్తూ) ఇన్ని చేసినా నే నేమైనా అన్నానా ? పట్టెడు మెతుకులు పెడుతున్నారని ఇలాంటి మాటలంటారా ? పోనిండి, మీ కంత కష్టంగావుంటే పది

నెల్లపాటు మా వాళ్ళింటికి పంపండి. హాయిగా వుందురు గాని. ఎందుకొచ్చిన జీవితం ? నా జీవితం.

సత్యం.– (కోపంగా) ఛా!... ఛావే!... నన్నుద్ధరిస్తావా ? పోతే హాయిగా వుంటాను. పోతే మావాళ్ళకి పెట్టే రన్న ఏడుపెందుకూ? ఇంతకాలం నీ తమ్ముడువచ్చి తిని పోయిందో ? అది మర్చిపోయేవేంటి ?

గౌరి.– నా వాళ్ళకేమంత గతిలేకపోలేదు. తిండికిలేక మీ యింటికి రాలేదు. తిన్నాడేమో గరిశెడు ధాన్యం యిచ్చిపోయేడేమో ? ఆ యిన్ని గింజలూ లేకపోతే మన పని తెలిసేది.

సత్యం.– ఆ ! ఎదురు చెబుతున్నావ్ ?... (అని చెంపమీద కొడతాడు) ఛీ! ఛా! అవతలికి. నేనంత చేతకాని వెధవనై పోయేనేం ? సరే... చూస్తాగా, మీనాన్న, అమ్మ ఏపాటి పెడతారో ? (అని పాగా కొయ్యనున్న బట్టలు తీసి మూట కట్టుతూ) నాల్గునెలలపాటు కనిపించకుండా పోతే... అప్పుడు మీ సంకటం కుదురుతుంది. ఎలా ఏడుస్తారో ఏడవండి ! (అంటూ మూట చంకనుబెట్టి చెప్పులో కాలు పెడుతాడు.)

గౌరి.– (ఇంతసేపూ ఏడుస్తున్న దల్లా చటాలున వెళ్ళి అతని చెయ్యిపట్టుకొని) ఇదిగో ! నన్ను చంపుకుతిన్నట్టే మీరు వెళ్ళితే. నన్నూ నా పిల్లడ్నీ ఏ గంగలోనైనా త్రోసేసి అప్పుడు వెళ్ళండి !

సత్యం.– ఛీ!... వదులు. ఏ గంగలో పడతారో పడండి. నేను మాత్రం ఒక్క-క్షణం వుండను. నీతోటీ, యీ అప్పు లాళ్ళతోటి బాధలుపడలేను. ఎక్క-డేనా సుఖంగావుండే ప్రపంచంలోకి పోతాను. (అంటూ పోబోతాడు)

గౌరి.– ఒద్దండి! నామాట వినండి! గంపెడంత సంసారాన్ని కాళ్ల తన్నుకుపోతారేమండీ? పాపాయినైనా చూడండి! వద్దండీ! వద్దండీ! ... (అంటూ యీడిగిల బడుతుంది)

సత్యం.– వద్దు ... నన్నాపొద్దు. (అంటూ గౌరిని త్రోసి వేసి వీధి తలుపు గడియతీస్తాడు)

(ఇంతలో వీధిలోంచి ప్రజాసమూహం ... ఏదో కంఠస్వరం)

రావోయి సోదరా!

రావోయి సోదరా!

మరో ప్రపంచం పిలచిందోయీ (

రావోయి సోదరా!

జై! శ్రమజీవుల పార్టీకి జై.

యువకుడు.– (ప్రవేశం ఎర్రజెండా పట్టుకుని) జై! శ్రమజీవుల పార్టీకి జై. (వెనుకనుంచి అందరూ అంటారు) ధనికవర్గం నశించాలి! బూర్జువా తొత్తులు నశించాలి! విప్లవం వర్ధిల్లాలి! (అందరూ) నమస్తే! కామ్రేడ్.

సత్యం.– (అకస్మాత్తు సంఘటనకు ఆశ్చర్యపోయి తత్తర పాటుతో) నమస్తే! నమస్తే!

గౌరి.—(చటాలున లేచి వారగా నిలువబడుతుంది కళ్ళనీళ్లు తుడుచుకుంటూ)

యువ.— పాపం! పేదల సంసారాలు ఇలానే వుంటాయి. గోచీకి పెద్ద, గావంచాకిచిన్న. ఆ యిల్లాలిని అలా ఏడి పిస్తావేం కామ్రేడ్ ?

సత్యం.— (తొత్తరపాటుతో) అహ! ... ఆ! ఏమీ లేదు, ఏవో....

గౌరి.— (దుఃఖంచే వణకుచున్న స్వరంతో, ధైర్యం తెచ్చుకొని) చూడండి బాబూ! గంపెడంత సంసారాన్ని, పెళ్ళాన్ని, పిల్లాణ్ణి కాలదన్ని ఎక్కడికో పోతానంటాడు. నాగతి ఏంకాను? నాకెవ్వరు దిక్కు చెప్పండి. ... యీ ప్రపంచాన్ని విడిచి మరో ప్రపంచంలోకి పోతా నట. నోటికొచ్చిన అఘాయిత్యాలు మాటలాడుతూ నన్నెలా దుఃఖపెడుతున్నారో చూడండి. మీరైనా చెప్పండి బాబూ! యీ ప్రపంచంలోనే వుండమని. నా పసుపూ కుంకుమ నిలుపమని చెప్పండి బాబూ! చెప్పండి!

యువ.— (ఏదో ఆలోచించి, వుద్దేశము నెరవేర్చుకొనువాని వలె నటించి) ఆ! ... చెప్తానమ్మా! తప్పకుండా చెప్తాను. అసలు ఇది మగనాలి తగువు. ఇలాంటి తగువులు యీ దేశం అంతటా వున్నాయ్! వీటికి కారణమైన దరిద్రం దేశంలో వున్నంతకాలం ఇటువంటి కలహాలు తప్పవు.

గౌరి.– అవును బాబూ! వచ్చినజీతం చాలక వెయ్యి రూపాయిలు అప్పుచేసేం. పరువూ, మర్యాదా పోతున్నావి. ఇంట్లోనూ వీధిలోనూ తలెత్తుకు తిరుగలేక పోతున్నాం. అందువల్ల ఆయన మనస్సు పాడై సంసారం వద్దు, పెళ్ళాం వద్దు, పిల్లలొద్దు అని ఏమో అఘాయిత్యాలు మాట్లాడుతూ నన్నెలా దుఃఖపెడుతున్నారో చూడండి.

యువ.– (సత్యాన్ని చూచి) కామ్రేడ్! నువ్వు మేధావంతుడవే! యీ మాత్రిందానికే యిలా కృంగిపోయి ఉద్రేకంతో ఎంతతో స్తే అంతా చేస్తావా?

సత్యం.– (చేతులుపట్టుకొని) అయితే ఏంచెయ్యమంటావ్? మిస్టర్! మా కష్టాలు మీకేం తెలుసు? నేను B. A. పాసయేను. చదువుకున్న రోజుల్లో నేనూ ఓ మేధావంతుడనే. ఆనాడు స్నాతకోపన్యాసంలో చెప్పేరు. "మీరందరూ భావినాయకులు. ప్రపంచం మీ మీద ఆధారపడి వుం"దన్నారు. అందరికీ అన్నవస్త్రాలు, విద్యాసౌకర్యాలు కల్గించడమే ప్రభుత్వకర్తవ్య మన్నారు. అందుకు మీరందరూ మాతో సహకరించాలని హెచ్చరించేరు. ఆనాడు ఎంతో సంతోషించేను. యీ ప్రపంచంలో అడుగుపెట్టేను. మానాన్నగారి స్నేహితుడు నన్నాదరించి తన కుమార్తెనిచ్చి వివాహంచేసేడు. తహశీల్దారు ఆఫీసులో వుద్యోగమిప్పించేడు. ఆనాడు నా భార్య నాకెంతో సౌమ్యంగా కనబడేది. ఈనాడు నాజీవితాన్ని కృంగదీసిన బ్రహ్మరాక్షసిలా కనబడుతున్నాది.

గౌరి.– (దుఃఖంతో) విన్నారా ఆమాటలు ? ఇదే వరస, మాటాడితే నా మీద విరుచుకుపడతారు. అన్నెమూ, పున్నెమూ యెరుగని అమాయకురాల్ని. నమ్మి వచ్చి నందుకిలా తూలనాడుతున్నారు. ఆ స్తిపాస్తులు పంపకాలైనా, పచ్చని మాసంసారాన్ని పాడుచేద్దామని, ఆయనవంక పుట్టెడుబలగంవుండీ, మావారి భుజాలుపోంగేసి వెయ్యిరూపాయిలు అప్పుచేయించేరు. తండ్రి పోయినతరువాత చదువుకోసమని వున్న భూమీపుట్రా అమ్మేసేరు. ఇంక నేనూ, మంగళసూత్రం మిగిలేం.



సత్యా.– (కోపంతో) చాలించు ! ఆడది ఎంత కేనాతగును. ఎటొచ్చీ సంసారాన్ని పాడుచేసింది నే ననేగా అనేది? మాటాడితే నీతమ్ముడు ఇచ్చిన గరిశెడుధాన్యం, మీ నాన్న పెట్టినబంగారం, బట్టలూ లెఖచెబుతూ నే నెందుకూ చేతకానివాడిగానూ, నువ్వే నన్ను పోషిస్తున్నట్టుగానూ చెబుతున్నావ్ ! అయితే నాఅవుసరం నీ కేముంది? ఇంత దన్ను నీకున్నపుడు హాయిగా బ్రతుకు.



గౌరి.– అవునుమరి. అలాగంటే ఇలాగ ! నామానాన నేను, మీ మానానమీరు బ్రతికేలాగైతే మా నాన్నగార్కి ఎక్కువుండా అంతబంగారం పెట్టి కన్యాదానంచేసింది ? అప్పుడే మానాన్నగారు నన్నే కాలేజీలోనో చదవేస్తే నేనూ యీపాటికి మాఅక్కలాగ B. A. ప్యాసై ఏ ఆఫీసరు పనో చేసి హాయిగా బ్రతికేదాన్నే. (ఏడుస్తూ) నా చదువు మధ్యలో తగలడబట్టి, నాబ్రతుకిలా కాబట్టి

నన్నింత నీచంగా చూస్తున్నారు. ఇంతేనా చేస్తారు? చెయ్యండి. వాళ్ళలాగా, వీళ్ళలాగా మూడు ముస్తాబులై వీధులంట తిరిగే వంశంగామగా? మీరేమన్నా ఏం చేసినా ఇంట్లో చచ్చి పడివుండవలసినదే!

సత్యం.— (తలకాయపట్టుకొని) ఆరె భగవంతుడా! నాకు చావు వచ్చిందికాదు. ఇంట్లో పెళ్ళాం, వీధిలో అప్పు లాళ్ళు, ఆఫీసులో ఆఫీసరు, ఇంతమంది మధ్యా కృశించి నశించిపోయేకన్న, ఎక్కడికో ఏ ప్రపంచానికో పోతే తీరి పోతుంది. కామ్రేడ్! చెప్పండి. ఆ ప్రపంచం ఎక్క డుంది? ఆ ప్రపంచంలో ఏంటుంటుంది చెప్పండి.

యువ.— హా! హా! హా! ప్రపంచం!... ఎక్కడోలేదా ప్రపంచం... ఇక్కడేవుంది.

గౌరి.— అమ్మయ్య! మీ యిల్లు వెయ్యి ఇళ్ళు అవుతాయి. అలా చెప్పండి బాబూ! ఇక్కడేవున్న యీ ప్రపంచాన్ని విడిచి ఎక్కడికో పోతానంటారు.

యువ.— అతనికి తెలీదమ్మా! అతనికేకాదు. గొప్ప గొప్ప వాళ్ళకే తెలీదు. ఆ ప్రపంచం సంగతి.

గౌరి.— ఆ! ఏమిటిబాబూ! అంత బాగుంటుందా ఆ ప్రపంచం?

సత్యం.— అబద్ధం! మీరు చెప్పేదంతా అబద్ధం! అలాంటి ప్రపంచం నా కనుచూపుమేరలో ఎక్కడా కనుపించ లేదు.

యువ.— ఇలా అనేది మీరేకాదు. గొప్ప గొప్ప వాళ్ళే అన్నారు. అలా అన్నవాళ్లందరూ ఆ ప్రపంచానికి దూరమై, అప్పులతోనూ, అవినీతితోనూ అంతఃకలహములతోనూ అల్లాడి కృశింస్తున్నారు.

గౌరి.— (భర్తతో) ఆ! మీరలాఅనకండి! ఆయన చెప్పినట్లు వినండి ?

సత్యం.— వింటాను. ఇదివర కెందరో చెప్పినప్పుడు విని నమ్మేను. కాని. చెప్పింది వేరు, చేసింది వేరు, విన్నది వేరు, అనుభవించింది వేరు అయింది. ఇక నెప్పుడూ విని నమ్మకూడదని నిశ్చయించుకున్నాను. ఇప్పుడు వినమంటే, ఎలా విని నమ్మేది ?

యువ.— వద్దు ! విని నమ్మవద్దు ! అనుభవించే నమ్మమంటున్నాము. మీరు విన్నమాటలు బూర్జువా తొత్తులవి, ధనికవర్గాలవి. వాళ్ళది బిచ్చగాళ్ళ రాజ్యం, అవినీతిపరుల రాజ్యం. ఆ రాజ్యంలో కష్టపడేవారికి ఫలితం లేదు. దున్నేవాడికి భూమిలేదు.

సత్యం.— అయితే మీరాజ్యంలో వున్నాయా ? మీ దే రాజ్యం ? మీ రాజ్యం ఎక్కడున్నది ?

యువ.— అవును, మా రాజ్యంలో వున్నాయ్. మాది శ్రమ జీవుల రాజ్యం ! గుమాస్తాల రాజ్యం ! కూలీల రాజ్యం ! కర్షకుల రాజ్యం !

గౌరి.— ఆ! ... ఏమిటీ? మీ రాజ్యంలో గుమాస్తాలే రాజులా?

యువ.— ఆ! ... అవునమ్మా! మా రాజ్యంలో గుమాస్తాలే రాజులు, కూలీలే మంత్రులు, కర్షకులే కామందులు. మీరందరూ మహారాణులు.

గౌరి.— ఏమో బాబూ! అంత అదృష్టమా? ... ఆరాజ్యం ఎక్కడుంది బాబూ?

యువ.— ఆ రాజ్యం ఎక్కడో లేదమ్మా! విప్లవంలోవుంది. విప్లవం మీ చేతుల్లోవుంది. మీ రందరూ విప్లవంలో పాల్గొనండి! అప్పుడు మీ కా రాజ్యంవస్తుంది. నీ భర్త మహారాజౌతాడు. నీ వో మహారాణీవౌతావు. జై, శ్రమ జీవులపార్టీకి జై! (అందరూ)

సత్యం.— (నిశ్చలతలో ఆలోచనా నిమగ్నుడై అలా ఉండి పోతాడు.)

యువ.— కామ్రేడ్! కదులు! కదంత్రొక్కు! కార్యదీక్షబూను! లే! మరోప్రపంచంలోకి లే! నువ్వెవ్వరికీ బాకీలేవు. నీకే యీ ప్రపంచం బాకీవుంది. నీ శ్రమకి యీ ప్రపంచం ఋణపడింది. కార్మిక, కర్షకుల కష్టానికే ప్రపంచం ఋణపడింది. ఈ ధనికవర్గం ఋణపడింది. నీ వెవ్వరికీ ఋణపడలేదు. అందరూ నీకే ఋణపడ్డారు. లే! లే!...

గౌరి.— (భర్తను కదుపుతూ) లెండీ! లెండీ!...

సత్యం.– (వుద్రేకంగా) లేస్తాను. విజృంభిస్తాను. విహారిస్తాను. వీథివీథులా. వాడవాడలా తిరిగి వ్యాపింపజేస్తాను విప్లవం.

యువ.– జై! శ్రమజీవుల పార్టీకి...కార్మిక కర్షకపార్టీకి... జై! అందరూ—

నదీనదాలు కొండలు కోనలు ఎడారులన్నీ దాటుకొని
పదండి అంతా ముందుకుపోదాం బంధాలన్నీ
తెంచుకొని.

(తెరవాలును)

## 2-వ రం గ ము

### ఛాయా ప్రదర్శనం

[తెల్లని తెరపైని మనుష్యులు పరుగెత్తుతున్న ఛాయలు. కాగడాలతో, కత్తులతో, తుపాకులతో కోలాహలంగా గేయంపాడుతూ— ]

మరోప్రపంచం – మరోప్రపంచం
మరోప్రపంచం వచ్చింది
పదండి అంతా ముందుకుపోదాం బంధాలన్నీ
తెంచుకొని

కార్మిక, కర్షక, మేధావంతుల
కాలం నేడే వచ్చిందీ
కాలమ్మృత్యువై ధనికవర్గముల గడగడవణికిం
చేస్తుంది. ||మరో||

దున్నేవాడిదె భూమందాం శ్రమించేవాడిదె
ఫలమందాం

నవప్రపంచ శంఖారావంతో
నాందిపాడుదాం రారండోయ్ ॥మరో॥

[ ఈవిధంగా పాడుతూ కోలాహలంగాపోతారు. ఛాయ అంతరిస్తుంది. తెరలేచును. ]

[ అది ఒకమిల్లుయజమానిగృహంలోగది. రాత్రిసమయం. చిన్న దీపంవెలుగుతూవుంటుంది. ఒకఇనుపబీరువా, సోఫాలు,కుర్చీలు,మొద లైనసామగ్రివుంటుంది. ఉచితరీతిగా అలంకరించబడివుంటుంది. వెనుక తెల్లనితెరవుంటుంది. ధనికుడైన భూపేంద్రుడుగోడకుచేరునగా మంచము పైపరుండివుంటాడు. ఇంతలో ఆతనికి స్వప్నంవస్తుంది]

ఒకస్త్రీ జుట్టువిరయబోసుకొని వికృతాకారంతో చేతఖడ్గంపట్టు కొన్నఛాయవస్తుంది.

స్త్రీ.— హా! హా! హా! (వికటాట్టహాసం)

భూపేం.— (భూపేంద్రుని ఛాయ వెనుకనుండి లేచును. ఇటువంటి ఏర్పాటు తెరవెనుక మనిషిని పరుండబెట్టి చేయవచ్చును)

ఆ! ఆ! ఎవరు నువ్వు?

స్త్రీ.— భూపేంద్రా! నిర్భయంగా పడుకున్నావా? లే! లే! నీకీ ప్రపంచంలో తావులేదు. ఇదిగో నీకోసంవచ్చేను. నీ ప్రాణాలు తీసుకుపోవడానికి వచ్చేను. కాలపాశం తీసుకొచ్చేను. రా! రా!... హా! హా! మృత్యుదేవతని హా! హా! హా! విప్లవదేవతని... రా! రా!... (అని సమీపించుచుండగా)

భూపేం.— ఆగు! ఆగు! నన్ను చంపకు! నన్ను బ్రతకనీ... ఎంత ధనంకావాలన్నా ఇస్తాను.. నా వూసురాకు ... మృత్యుదేవతా నా మీద నీకూ పగేనా? ఆ దుండ

గులతో నువ్వూ చేర్తావా? మృత్యుదేవతకి కూడా
పార్టీఫీలింగేనా?

స్త్రీ.– హా! హా! హా... పార్టీ!... ఫీలింగు! నాకా!...
లేదు. నాకు పార్టీఫీలింగులేదు. నే నన్నిపార్టీలకీ చెందు
తాను. నే నన్నిటిలోనూవున్నాను. నాకోసం యీ
పార్టీలు పుడతాయ్? సస్తాయ్. అంతర్జాతీయసంఘం,
ఆటంబాంబులసంఘం... ఇంకా ఇంకా అన్ని సంఘాలు
నావే... నేను లేని సంఘం అంటూ లేదు...

భూపే.– ఆ!... అన్నిట్లోనూ వున్నావా?... నీ...పేరు?

స్త్రీ.– నాపేరు ధనం. ఇంకోపేరు దురాశ... మరోపేరు
మృత్యువు. మృత్యువుని తప్పుకోడం అసాధ్యం. రా!
రా!... హా! హా! హా!

భూపే.– (భయంతో) రాను? రాను?

స్త్రీ.– హా! హా! హా! రావ్వూ? రాకేంచేస్తావ్? నువ్వనగా
ఎంత?... మహారాజుల్ని మసిచేశా... రాజ్యాల్ని
నాశనంచేశా... మహాయుద్ధాలు చేయించా... మను
ష్యుల్ని మారణంచేశా... విప్లవం సృష్టించా. అదిగో?
అదిగో... విప్లవం! మహావిప్లవం! రా? రా? ...

(ఇంతలో కోలాహలం వినబడును...)

ధనికవర్గం నశించాలి!
శ్రమజీవులరాజ్యం రావాలి!
బూర్జువావర్గం నశించాలి!

భూపే.— (తృళ్ళిపడి లేచి) ఛ స్త్రీకాదు... (భయభ్రాంతుడై ఇటునటు తిరుగుతూ) ధనికవర్గం నశించాలి ?... ధ ని క వర్గం నశించాలి ?... విప్లవం వర్ధిల్లాలి ?... వి...ప్ల... వం ! దేనికీ విప్లవాలు ? ... దేనికీ ?...

లక్ష్మి.— (ఊపిరాడకుండా ఆభరణాలు ధరించుకొని, తల నిండా పువ్వులుపెట్టుకొని కండ్లు మెరిసే చీరకట్టుకొని గ్లాసుతో పాలు పట్టుకొని ప్రవేశం)
ఏమండీ ?...

భూపే.— ఆ ? (వెనుతిరిగిచూచి)

లక్ష్మి.— ఏమిటండీ ? కేకలు.

భూపే.— ఆ ?... హా! హా! హా! ధనికవర్గం నశించింది లక్ష్మి! లక్ష్మి !... (అంటూ వుద్వేగంగా చూస్తూ లక్ష్మిదగ్గరిగా పోయి ఆమెధరించుకున్న ఆభరణాలు చూపుతూ) మహా సర్పాలు !... కాలసర్పాలు... ఇవన్నీ... నీ కంఠాన్ని కొరికి కాలకోటి విషాన్ని గ్రక్కుతాయి లక్ష్మీ ...

లక్ష్మి.— (భయపడుచూ గ్లాసు క్రిందకు జార్చి, వెనుకకు అడుగువైచి, రెండుచేతులతో ఆభరణాల్ని గుండెకు హత్తుకొనుచూ)

కాదు...కాదు. ఇవి సర్పాలు కావు, ఆభరణాలు. మీరు చేయించిన ఆభరణాలు. అలా అనకండి నాకు భయం వేస్తున్నాది.

భూపే.— హా! హా! హా! ఆభరణాలు? కాదు, కాదు లక్ష్మీ! ప్రాణాలుతీసే కాలపాశాలు. తీసిపారే?... తీసిపారే? ఆ! ఆ! (అంటూ ఆభరణాన్ని పట్టుకుని విదలిస్తాడు)

(ఇంతలో గదితలుపు త్రోయబడి "ఢాం! ... ఢాం!" అని రివాల్వరు ప్రేలుతుంది)

లక్ష్మి.— ఆదెబ్బ లక్ష్మికి తగిలి కెవ్వున కేకవైచి క్రిందపడి పోతుంది.

సత్యం.— (ప్రవేశం. మిలిటరీ దుస్తులతో చేత రివాల్వరు పట్టుకొని) ధనికవర్గం నశించింది? విప్లవం వర్థిల్లింది?

భూపే.— (అకస్మాత్తుగా జరిగిన ఆ సంఘటనకు దుఃఖమూ. భయమూ, ఉద్రేకమూ ఒకసారివచ్చి నేత్రాలనుండి తొంగిచూస్తాయి. గాని ఏం చేయలేకపోగా క్రిందపడ్డ లక్ష్మిమీదపడి) లక్ష్మీ! (అని విలపిస్తాడు)

సత్యం.— హా! హా! హా! ఇంకెక్కడి లక్ష్మి? నీకు లక్ష్మిలేదు, లక్ష్మికి నువ్వూ లేదు...లక్ష్మిమాది.

భూపే.— (మతిపోయినవానిలా) ఆ? ... లక్ష్మిమీదా?... కాదు ... నన్ను వరించింది. నాది.

సత్యం.— హా! హా! హా! నిన్ను వరించింది. విడచిపెట్టింది. ఇంకొకర్ని వరిస్తుంది అంతే ...

భూపే.— ఆ! అంతేనా?

సత్యం.— అంతే. నిన్ను వరించింది నీ భార్యలక్ష్మి కాదు. లక్ష్మి అంటే ధనం. అది ప్రభుత్వాన్నే వరించాలి. ఇంకెవర్నీ వరించకూడదు. అలా జరుగుతే లోకశాంతి నశిస్తుంది.

భూపే.— నిజం! ... లో ... క శాంతి నశిస్తుంది. అది ఎవర్ని వరించినా వాళ్ళకి శాంతిలేదు. నాభార్య అలా కాదు. నన్నే వరించింది. ప్రేమించింది. నీలక్ష్మికోసం నాభార్యని చంపేవ్? నీలక్ష్మికోసం ఇంకెందర్ని చంపుతావ్?

సత్యం.— ఎందరైనా చంపుతాం. ఏదైనా చేస్తాం లక్ష్మి కోసం. లక్ష్మిపై సంపూర్ణాధికారం ప్రభుత్వానిది. ప్రభుత్వం కళ్లు కప్పి లక్ష్మిని చేజిక్కించుకొనేవారిని నాశనం చేస్తాం. బతికి బాగుపడాలనే ఆశవుంటే ప్రభుత్వ ఆజ్ఞల్ని శిరసావహించాలి? ఆస్తి పాస్తుల్ని ప్రభుత్వానికి వప్పజెప్పాలి? అడ్డుతిరిగితే నాశనం! సర్వనాశనం.

భూపే.— ఆ? ... హ! హ! హ! అడ్డు తిరిగితే నాశనం? సర్వనాశనం! ఆ ప్రభుత్వం సర్వనాశనం చేస్తుందా? హ! హ! హ! ఏప్రభుత్వం?

సత్యం.— శ్రమజీవుల ప్రభుత్వం గుమస్తాల ప్రభుత్వం ... కార్మిక కర్షకుల ప్రభుత్వం ... అది మా ప్రభుత్వం. మా ఋణ బాధలు నివృత్తి చెందడాన్కి— మా కష్టానికి ఫలితంరావడానికి, మేం స్థాపించుకున్న ప్రభుత్వం. ఆర్థిక సమానత్వాన్ని స్థాపించి, అన్నవస్త్రాలకు లోటురానీ

యని ప్రభుత్వం. మా ప్రభుత్వంలో బూర్జువాలకి స్థానం లేదు. బురఖారాయళ్ళకి స్థానం లేదు. పొండి!...పొండి! ఈభవనాలు విడచి పొండి? మీఫాక్టరీలను, జమీాలను వదలిపొండి? ఖజానా తాళాలివ్వండి? ... పొండి?

భూపే.— (తాళాలువిసరేసి) పోతాం, మేంపోతాం. మీారు వస్తారు, మీారూపోతారు.

సత్యం.— మేంపోం. శాశ్వతంగా వుంటాం. మాప్రభుత్వానికి నాశనం లేదు. ధనికవర్గాలకి. హా! హా! హా! ధనికవర్గం నశించింది! శ్రమజీవులకి విజయం చేకూరింది, (అందరూ)

భూపే.— (ఉద్వేగంగా మొలనున్న తాళాలు విసరివేసి) ధనికవర్గం నశిస్తుంది... బూర్జువావర్గం నశిస్తుంది ... తీసుకోండి తాళాలు) కొట్టండి ఖజానా, తీసుకోండి ఫ్యాక్టరీలు, జమీాలు లాక్కోండి, ధనవంతులుకండి. జమీాందారులుకండి, బూర్జువాలు కండి, నశించండి, చావండి... గంగలోపడండి. (లక్ష్మినిచూచి) లక్ష్మి! నాలక్ష్మి పోయింది. ఒంటెడు నగలతో వరచూపులతో ఒంటరిగా పోయింది. నాతోఆడింది. నాతోపాడింది. నన్ను మోసంచేసి పోయింది. పోతా—నేనూపోతా—కార్మికుడ్ని అయిపోతా — కర్షకుడ్ని అయిపోతా — శ్రమజీవులలో కలిసిపోతా. హా! హా! హా! ధనికవర్గం నశించాలి? బూర్జువావర్గం నశించాలి! హా! హా! హా! (అంటూ నిష్క్రమిస్తాడు.)

సత్యం.— పో! ... హా! హా! హా! పో! పోయేడు. బీదల రక్తమాంసాలు పీల్చి, పీల్చి సంపాదించిన ధనాన్ని విడిచి పోయేడు. ఇక రాడు, రాలేడు.

కార్మి. కర్ష.— (ప్రవేశం) స్త్రీకొడవళ్ళు చేతబట్టుకొని వెళుతూవున్న ధనికునివైపు చూస్తూ) పోయేడు—పోయేడు మరిరాడు – రాలేడు.

కర్ష.— ఒరేయ్! కార్మికా!

కార్మి.— ఏరా? కర్షకా! చూడురా? ఆబాబుని. మనపాలిట దేవుడు. ఈ తెలివైన బాబులందరూ, మనపక్షం కాసేరు. శ్రామజీవుల రాజ్యాన్ని స్థాపించేరు. ఇంకేటిరా? కోపం.

కర్ష.— అవునారి కార్మికా! చూడురా! యీధనం. ఆ అద్దాలు చూడురా? ఆ పటాలు చూడురా?

కార్మి.— ఆ! ఆ! అవునారి! అవ్వునా! (అంటూ క్రింద చూస్తాడు. శవాన్ని చూసి కెవ్వున కేక వేసి కర్షకుడిని పట్టుకుంటాడు.)

సత్యం.— హా! హా! హా! దడుసుకున్నావా? ధనాన్ని చూసి.

కార్మి.— శవాన్ని చూసి బాబయ్యా!

కర్ష.— నావొంటిమీది ధనంసూడ్రా? ఆ శవంమీది ధనం శ్రమజీవుల ఋణంరా!

సత్యం.— అవును. అది ఋణం. మనకి ఋణపడ్డారు. శ్రమ జీవుల ఋణం యీ ప్రపంచం. మనఋణం తీర్చలేకపోతే రణం. అందుకే యీమారణం కార్మికా! కర్షకా!

కార్మి. కర్ష.— ఏం ? బాబయ్యా !

సత్యం.— మనఋణాలు తీరేయ్. సంసారాలు బాగుపడ్డాయ్. శ్రమజీవుల రాజ్యం వచ్చింది. మనం ధనవంతుల మౌతాం. జమీందారుల మౌతాం పదండిముందుకి. ప్రపంచాన్ని పరిపాలిద్దాం! విశ్వంలో విహరిద్దాం! విజయం మనదని చాటేద్దాం !

(అందరూ) పదండి ? పదండి.

(ఒక కంఠస్వరం)... ఆగండి ? ఆగండి ?... మీరక్కడే ఆగండి ?

(అంటూ దుబ్బుమీసాల డిక్టేటరు ప్రవేశిస్తాడు రివాల్వరుతో)

డిక్టే.— ఆగండి! ప్రపంచాన్ని పరిపాలించేద మీరుకాదు, విశ్వంలో విహరించేది మీరుకాదు, యీ ప్రభుత్వం. శ్రమ జీవుల సౌఖ్యంకోసం రణజ్వాలలు రేకెత్తించి, రక్తం ధార పోసిన ప్రభుత్వం. శ్రమజీవుల ప్రభుత్వముకాదు, శ్రమ జీవులకోసం ప్రభుత్వం. శ్రమజీవులు శ్రమించాలి. ప్రభుత్వం పరిపాలించాలి. శ్రమజీవులు శ్రమజీవులే... జమీందారులుకాకూడదు. ధనవంతులుకాకూడదు. శ్రమ మీది, ఫలితంమాది. ఆహారం మీది, ఐశ్వర్యంమాది.

సత్యం.— ఆ !...

డిక్టే.- అంతే.

కార్మి, కర్ష.- (సత్యాన్ని చూచి) ఏటి! బాబయ్యా? ఇంత ఘోరం! శ్రమించేది మేమా? ఫలితం ప్రభుత్వాందా? ఏటిబాబూ?

సత్యం.- (బుర్రదించుకొని) అంతే. ప్రభుత్వాజ్ఞకి తిరుగు లేదు. నేనూ సేవకుడినే మీరు సేవకులే. పదండి మన కుటీరానికి? ఫ్యాక్టరీలకి పదండి? పదండి వ్యవసాయ కేంద్రాలకి?

అందరూ.- అందరూ తలలువంచుకొని దీనంగాపోతారు.

డిక్టే.- పొండి! హ! హ! హ! తిరిగి చూడకండి?... హ! హ! హ! ధనికవర్గం నశించింది!... శ్రమజీవుల ప్రభుత్వం వచ్చింది!

(ఎవరూ అనరు)

(రివాల్వరుపేల్చి) థాం! ... అనండి! ... అందరూ అనండి!

(అందరూ అంటారు)

డిక్టే.- హ! హ! హ! పాడండి మహాప్రస్థానం!

(అని ఠీవిగా నిలచునియుండగా వెనుక అందరూ పాడుతారు)

— గే యం —

మరోవిధంగా – మనోహరంగా। మహీమండలం మార్చేద్దాం
పదండి ముందుకు పదండి త్రోసుకు। పోదాం పోదాం పైపైకి ॥మరో॥

ఎదురుతిరుగు ఏ మొనగాడైనా। యీడ్చి పొడిచి
గ్రద్దల కేద్దాం
పూరిగుడిశలను పరపరకోసి। మహాభవంతులు
కట్టేద్దాం ॥మరో॥
గృహాపరిశ్రమల గుండెలుజీల్చి। కర్మాగారాల్
స్థాపిద్దాం, యంత్రాలతో భువిని నింపేద్దాం
దుక్కిటెద్దులను తుపాకిగుండ్లతో। ట్రాక్టర్లకు
బలివేసేద్దాం ॥మరో॥
దేవాలయ శిఖరాలను ద్రుంచి। దేవుళ్ళనుడివికెగరేద్దాం
ప్రభుత్వ ఆజ్ఞను తిరస్కరిస్తే। ఫిరంగిగుండ్లను
పేల్చేద్దాం ॥మరో॥

( తెరవాలును )

## 3-వ రం గ ము

అది మనోహరంగా అలంకరించబడిన గది. గోడలకు శ్రమజీవుల నాయకుల చిత్రాలుంటాయి. గౌరి అందంగా అలంకరించుకొని చేత ఒక పూలదండ పట్టుకొని, తనభర్త ఫోటో చూస్తూ పాడుతూవుంటుంది.

— పా ట —

నాథుడువస్తాడు – నా నాథుడువస్తాడు
నవ్వు మోముతోటి– నను చేరి బుజ్జగిస్తాడు –ఎన్నెన్నో
తెచ్చియిస్తాడు
శ్రమజీవి ప్రభుత్వంలో నీ – సౌఖ్యాన్ని తెచ్చి
యిస్తాడూ ॥నా॥

అందమంతచూచి ఆనందమందిపోతాడు
ఆలింగనమ్ము చేస్తాడు
నాతో కోరిచేరి – నవ్వులాటూ లాడుతాడు ॥నా॥
(అనిపాడి పూలమాల నాగుని ఫోటోకు అలంకరిస్తుంది.)

— ఇంతలో వీధితలుపు తట్టినచప్పుడు – వీధిలోంచి సత్యం —

సత్యం.– గౌరి! గౌరీ! ...

గౌరి.– (తనభర్త కంఠాన్ని గుర్తుపట్టి సంతోషపారవశ్యంతో) వచ్చేరు... నానాథుడు వచ్చేరు... (అంటూ అద్దంలో అందం చూచుకొని పైటసవరించుకొని తలుపు గడియ తీసి తెబిలువద్దకు వచ్చి వెనుతిరిగి నుంచుంటుంది.)

సత్యం.– (ప్రవేశం) (మోయరాని బరువు వీపునధరించి, ఇనుపటోపీ ధరించి, చేత తుపాకీ, మిలిటరీ దుస్తులతో ప్రవేశం.) గౌరీ! గౌరీ! ఇటుచూడు? నావేపుచూడు? నే నెలావున్నానో చూసేవా? నాకోసం ఎదురుచూస్తు న్నావ్ కదూ?

గౌరి.– అవును. ఎంతకాలమై వెళ్ళిపోయేరు? (అని వెను దిరిగి చూచి భయంతో కెవ్వున కేకవేస్తుంది)

సత్యం.– (ఆతృతతో) గౌరీ? (అని దగ్గరగా వెళ్ళి రెండు చేతులూ పట్టుకుంటాడు)

గౌరి.– (బెదరు చూపులతో) మీరేనా?

సత్యం.— ఆ! ...నేనే గౌరీ! సత్యాన్ని... భయపడు తున్నావా? గౌరీ! నేను మారిపోయేను గౌరీ?

గౌరి.— (బెదరిచూస్తూ చేతులు తప్పించుకొని దూరంగా నిలు చుంటుంది.)

సత్యం.— ఈచేతులు కఠినంగా తగిలేయా? గౌరీ! అవును.... యీ వేళ్ళు తుపాకీ మీటలపై వీణవాయించేయ్. ఎంద రెందరినో తుండెలు తుండెలుగా చెండాడేయ్. మొద్దు బారిపోయేయ్. పాపిష్టి చేతులు. నీ కోమల హస్తాల్ని సుఖపెట్టలేక పోయేయ్.

గౌరి.— (కష్టంతో ఏడ్చి) ఆ! ... అలాఅనకండి! ... మీ చేతు లేంచేసేయ్! నాదాత. మీ కేదో గొప్ప వుద్యోగం అవుతుందని, మనఋణబాధలన్నీ తీరిపోతా యని, అతను చెప్పినమాటలు విని మోసపోయేను. మిమ్మల్ని తొందరపెట్టేను. విప్లవంలోకి పంపించేను. ఇంతగా మారి పోతారనుకోలేదు వాళ్ళు ద్రోహం చేస్తారనుకోలేదు. మిమ్మల్నిలా మారుస్తారనుకోలేదు. ఆ దుష్టులు...

సత్యం.— గౌరీ!...ఆగు! అలా అనకూడదు. అది ప్రభుత్వం. నన్ను మార్చింది శ్రమజీవుల ప్రభుత్వం. దాని కెదురు లేదు. ఎదురు చెప్పకూడదు. అలా ఎదురుచెప్పే నీ లాంటి కోమలాంగుల్ని, సుకుమారుల్ని స్వేచ్ఛాజీవుల్ని, ఎందర్నో హతమార్చేయి యీచేతులు. ఇవి పాడు చేతులు గౌరీ! నా వుద్యోగం అదేగౌరీ!

గౌరి.— (భయంతో) ఆ! హత్యలా!

సత్యం.— అవును... హత్యలే!

(ఇంతలో వీధిలోంచి పలకా పుస్తకములు పట్టుకొని కుమారుడు మోహన్ పరుగెత్తుకొని వచ్చి)

మోహన్.– అమ్మా! అమ్మా! (పలకా పుస్తకాలు విసరి) నేను బళ్లో కెళ్ళనమ్మా!

గౌరి.– నాన్నా! బా నాన్నా! రా! అదిగో! చూడు? మీనాన్నని చూసేవా! ఎలా వున్నారో!

సత్యం.– రా! మోహన్!

మోహన్.– ఊఁ! నేనురాను. నువ్వు మా నాన్నవికావ్. అదేంటమ్మా! మానాన్న అలావుంటారా! ఫొటోలో నాన్నలా లేరే!

సత్యం.– లేనునాయనా! ఈ వుద్యోగం చేస్తున్నప్పుడు ఇలాంటి బట్టలనే వేసుకోవాలి.

మోహ.– అదేంటి? తుపాకీపట్టుకున్నావ్. అందర్నీ చంపేస్తావా! ఏంటి? అంతేసి బరువు మోస్తున్నావ్. కూలి వాళ్ళని పెట్టుకోకూడదా!

సత్యం.– నేను చేసేది కూలిపనే – అందుకే మోస్తున్నా బాబూ!

మోహ.– అదేంటి? అబ్బే! మానాన్న కూలిపనిచెయ్యడు. పెద్ద ఆఫీసరు. ఎంతోడబ్బిస్తారు. ఏం! కదమ్మా?...

గౌరి.– తప్పు. అలా అనకూడదునాయనా! ఆయనే మన నాన్నగారు.

మోహ.– అమ్మా! మరేం:.. నేను బళ్లో కెళ్ళనమ్మా! బళ్లోనేం...మంచిమంచి కథలు, పద్యాలు చెప్పరమ్మా! రాముడు, ఆంజనేయుడు, కృష్ణుడు మీద కథలేం చెప్ప రమ్మా! గాంధీతాతంటే వాళ్ల కెంతో కోపమమ్మా!

సత్యం.– హా! హా! హా! మరేం చెప్తాడనాయనా!

మోహ.– నీ కెందుకూ? వాళ్ళెవరో తెల్లగావుంటారు. అదేంటో చెప్తారమ్మా! నాకేం బోధపడదు!

గౌరి.– తప్పునాయనా! బడికిపోవాలి. నేను లోపలికిపోయి నాన్నకి పాలు, పళ్ళు, రొట్టెలు తెస్తాను కూర్చోమను. ఆ!... ఆ డ్రెస్సూ అది విప్పి ఆ గ్లాస్కో పంచికట్టండి.

సత్యం.– (ఏదో జ్ఞాపకంవచ్చి, తత్తరపడుతూ) ఆ!... అలాగే...

గౌరి.– రాబాబూ! నాన్నకి పంచ, లాల్చీ ఇస్తాను. (అని కుర్రాడ్ని లోపలి తీసుకుపోతుంది.)

సత్యం.– హుఁ! దీనికింకా తెలీదు. నేటి రాజ్యాంగవ్యవస్థ ఎలా మారిపోయిందో! గ్లాస్కోబట్టలు ధరించి తనతో ఆడడానికి వచ్చేనని అనికుంటున్నాది. ఆనాటి భారతీయత యీ మెలో యింకా అంతరించలేదు, హుఁ!... పాతివ్రత్యాన్ని పట్టుకు ప్రాకులాడే ఇలాంటి పుణ్యవతులు యీ నూతన రాక్షసరాజ్యాంగలో నాశనమౌతారని గ్రహించలేకపోతున్నారు. ఆహా! ఎంతటి దేశానికి ఎంతటి గతిపట్టింది!

( ఇంతలో మిలిటరీ సెంటరునుంచి సైరెన్ వినబడుతుంది. )

సత్యం.— (అదిరి) అదిగో! సైరెన్! స్వర్గతుల్యమైన భారత వ్యవస్థనుంచీ నరకంలోకి పిలుస్తున్న పిశాచస్వరం. పోతా పోతానని చెప్తే పోనివ్వరు. చెప్పకుండాపోతా... పోతా (అంటూ పోతూవుండగా)

గౌరి.— (ఒక చేతితో దుస్తులు, రెండవచేతితో ఫలహారమూ పట్టుకొని వచ్చిపోతూవున్న భర్తనుచూచి) వెళ్ళకండి? వెళ్ళకండి ? (అని ఆత్రుతతో పరుగెత్తబోయి పడిపోతుంది. )

మోహన్.— ( లోపలినుండి పరుగెత్తుకొనివచ్చి ) అమ్మా! అమ్మా! (చేతులు విదుపుకొని ఏడుస్తూ అమ్మదగ్గరగా వెళ్ళి కొంగుపట్టుకొని లాగుతూ ఏడుస్తూ) అమ్మా! లేవే! మా అమ్మ పడిపోయింది ఎవరూరారు ?

డిక్టేటరు.— (అదే సమయానికి ప్రకాశం మిలిటరీదుస్తులు, చేత ఒక కేనుతో వచ్చి ఆమెశిరస్సునను దగ్గరగా నిలుచుంటాడు.) ఏం ? అబ్బాయ్! మీఅమ్మ పడిపోయిందా!

మోహన్.— అమ్మా లేలే! ఎవరో వచ్చేరే.

గౌరి.— ఆ! వచ్చేరా! (అని శిరస్సు ఎత్తకుండా అతనిబూటు కాళ్ళు పట్టుకొని) వెళ్ళకండి! ఎక్కడికీ వెళ్ళకండి! మీతో నన్నూ తీసుకుపొండి! మిమ్ము విడిచి ఒక్క క్షణం వుండలేను.

డిక్టేటరు.– హా! హా! హా! వెళ్ళకండి! ఎక్కడికీ వెళ్ళకండి!... మగాడినివిడిచి ఆడది... ఆడదాన్ని విడిచి మగాడు ఒక్కక్షణమేనా వుండరూ?... హా! హా! హా! వుండాలి! వుండికోవాలి!

గౌరి.– (రెండు పాదములపై బుజ్జినానించి గట్టిగాపట్టుకొని) ఉండలేను. ఒక్కక్షణంకూడా వుండలేను. ఆడదానికి భర్తతోటిదే లోకం... భర్తతోటిదే జీవనం. అలా అనకండి?...

డిక్టే.– హా! హా! హా! అంటాను.

గౌరి.– ఆ!... (అని కాళ్ళువదలి బుజ్జిపైకెత్తి చూస్తుంది) కెవ్వున కేకవైచి చటాలున లేచి పిల్లడ్ని దగ్గరకుతీసికొని కొట్టుకుంటున్న హృదయంతో పైటసర్దుకొని గోడవారగా పోయి వెనుదిరిగి నిల్చుంటుంది)

డిక్టే.– హుం!... నేనేం చెయ్యాన్నా! భూతాన్నా? మగాడ్ని చూస్తే ఆడదానికెందుకేం భయం? వెధవసంఘం. యిలా తయారుచేసింది ఆడాళ్ళని.

గౌరి.– (వెనుదిరిగి పిల్లాడ్ని గట్టిగా పట్టుకొని భయాందోళనలతో) మగాళ్లు లేనిసమయంలో యీ విధంగా రావడం బాగులేదు. ఇది సంసారుల ఇల్లు.

డిక్టే.– హా! హా! హా! సంసారులు... సానులు... సానైవరు? సంసారులెవరు? అందరూ స్త్రీలే!... స్వేచ్ఛగాతిరిగి నంతమాత్రాన సాని అయిందా? బానిసబ్రతుకు బ్రతికి

పకికృశించే యీ గబ్బిలాలందరూ పతివ్రతలూనా?...
కాదు... ఈ ప్రభుత్వంలో అలా ఎన్నటికీ కాదు.
కాకూడదు. (రెండడుగులు ముందుకువేసి) ఇదిగో?...
చెప్పేది జాగ్రత్తగా విను! మాకు ఆడవాళ్ళుకావాలి!
ప్రభుత్వకార్యాలయాల్లో పనిచేయడానికి మీ రందరూ
కావాలి! ఇల్లు విడిచి బయటకురావాలి!

గౌరి.– (పిల్లడ్ని గట్టిగాపట్టుకొని భయంతో) రాం! మేం
ఎక్కడికీ రాం! మా వంశంలోలేనీ ఆచారం. మా
దేశంలోలేని ఆచారం మాకు తెచ్చిపెట్టకండి? మమ్మల్ని
వీధిపెట్టకండి? మా సంసారాలు పాడుచెయ్యకండి?
దాంపత్యధర్మాన్ని నాశనంచేయకండి? సంఘాన్ని పాడు
చేయకండి? లోకశాంతిని కాపాడండి? ఆడదాన్ని వీధి
పెట్టకండి?...నాభర్తదగ్గరికి నన్ను పోనివ్వండి? మమ్మల్ని
దూరంచెయ్యకండి?

డిక్టే.– హా! హా! హా! ధర్మపన్నాలు!... ఎవరక్కడ?

(మగవాని డ్రస్సులోనున్న ఒక స్త్రీ ప్రవేశం. పేరు స్వేచ్ఛ.

స్వేచ్ఛ.– (ప్రవేశం, సెల్యూట్ చేస్తుంది)

డిక్టే.– (గౌరితో) ఇదిగో! చూడు? ఎవరో తెలుసా?

గౌరి.– (తెల్లబోయి చూస్తుంది)

డిక్టే.– హా! హా! హా! ఆడది. నీలాంటి|ఆడదే...పేరు స్వేచ్ఛ.
మా ఆఫీసులో టైపిస్టు. జీతం 300–0–0 రూపాయలు.

ఆమె సంపాదించుకొని హాయిగా ఖర్చుపెట్టుకుంటూంది. మరి నువ్వు ?

గౌరి.— నాకేం. నాభర్త సంపాదిస్తాడు. హాయిగా ఖర్చు పెట్టుకుంటా.

డిక్టే.— హుఁ! నీ భర్త ?... నీ భర్తకీ నీకూ కొన్ని వేలమైళ్ళ దూరం. అతని సంపాదన అతనిదే. నీ సంపాదన నీదే. ఎవరికష్టం వారిది. నీ భర్త నీదగ్గరకురాడు. నువ్వాక్కడికి వెళ్ళలేవు. మీ యిద్దరికీ మధ్య నూతన రాజ్యాంగ వ్యవస్థవున్నది. అది మిమ్మల్ని కలియనియ్యదు. మీ యిద్దరికీ పనిచెబుతుంది, చేయిస్తుంది, ధనంయిస్తుంది.

గౌరి.— వద్దు... ఆ ధనం వద్దు... ఆపనీ వద్దు.

డిక్టే.— వీల్లేదు. కష్టపడాలి ... నిర్బంధ కార్మికశిక్షణ పొందాలి! వుద్యోగం చెయ్యాలి! సిగ్గు, లజ్జలు విడిచి చాకచక్యంగా వుండాలి! "ఆడదంటే మగాడికి ఏమాత్రం తీసిపోదు" అన్నట్లు అన్నిరంగాల్లో మీరు పనిచెయ్యాలి! ధనం సంపాదించి సుఖించాలి! స్వేచ్ఛా! నువ్వు చెప్పు! వొప్పించు. వీధిలోకి రప్పించు! పని చేయించు. జాగ్రత్త!

స్వేచ్ఛ.— (సెల్యూట్ చేస్తుంది)

డిక్టే.— వెళ్ళను.

స్వేచ్ఛ.— వెంటనే తలుపు గడియపెట్టి తలుపునకు జారపడి నిట్టూర్పువిడిచి గుడ్లప్పజెప్పి గౌరివేపు చూస్తుంది.

గౌరి.– నీకూ దయలేదా? నామీద.

స్వేచ్ఛ.– (ఒక్కఅడుగు ముందుకువచ్చి) హుం! ... దయ! ఎప్పుడో పోయింది. ఈదేశంలోనే లేదు.

గౌరి.– హుం!... అలాఅనకు. దయే మానవత్వం. అది లేక పోతే లోకమే లేదు. అలాఅంటావు నీకు మాత్రం దయ లేదూ?

స్వేచ్ఛ.– (ఆమాటలు వింటూ ఏవో ఆనవాలు పట్టినట్లు చూస్తూ అలా నిలబడిపోతుంది.)

గౌరి.– (దగ్గరగావచ్చి రెండు భుజాలు పట్టుకొని) ఏం? సమాధానం చెప్పవ్? చెప్పవ్?

స్వేచ్ఛ.– (చిన్నచవ్వునవ్వి) నీ మాటలు వింటూంటే మా చెల్లి జ్ఞాపకం వస్తూంది.

గౌరి.– ఆ! మీకు చెల్లికూడా ఉందా? నాకూ ఓ అక్క వుంది. B. A. చదువుకుంది. సరిగ్గా నీయంతే వుంటుంది. చూసి చాలాకాలమైంది, ఆమెపేరు సరోజ.

స్వేచ్ఛ.– ఆ! ... సరోజా! ... చెల్లీ! ... ఆ నిర్భాగ్యురాలిని నేనే. (అని ఆలింగనం చేసుకుంటుంది)

గౌరి.– అక్కా (అని పునఃగాఢాలింగనం చేసుకుంటుంది)!

(ఉభయులూ ఒక్క క్షణకాలం "అక్కా" "చెల్లీ" అనే పిలుపు పిలుచుకుంటూ దుఃఖిస్తూ వుంటారు)

శ్వేచ్ఛ.— (నిట్టూర్చి) గౌరీ! ఎన్నాళ్ళకు చూశాను గౌరీ! యీ అభాగ్యురాలు కులట. శ్వేచ్ఛ అనే పేరుతో వున్న సరోజ.

గౌరి.— ఆ! ... అలాగా? అక్కా! ఎలా మారిపోయావ్? యీ పాడువుద్యోగంలో ఎందుకు చేరావక్కా? ఎంత కాలానికి చూశాను.

శ్వేచ్ఛ.— (కుఱ్ఱాడినిచూసి) మోహన్! (ఎత్తుకుంటుంది)

మోహన్.— ఊఁ! ఊఁ! యీ అబ్బి ఎవరో నన్ను ఎత్తుకుంటున్నాడమ్మా!

గౌరి.— అబ్బికాదు నాయనా! దొడ్డ.

మోహన్.— దొడ్డ కాదు ఎవరో అబ్బి. ఊఁ! ఊఁ! నన్ను దించేయి. మా అమ్మదగ్గరికి పోతా.

శ్వేచ్ఛ.— అబ్బినికాను నాయనా? మీ దొడ్డనే! (పిల్లాడిని దించి) చెల్లీ! నీమతం, నీభావాలు విన్నతరువాత నిన్ను చెల్లీ అని పిలవడానికి నా కేమాత్రం అర్హత లేదు. (అని కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది)

గౌరి.— అలా అనకక్కా!

శ్వేచ్ఛ.— లేదు, గౌరీ, నేను కులటని. పతితురాలిని. ఆ పాడుచదువూ ఆ పాడుసంస్కారము నన్నీ స్థితికి తెచ్చాయ్. ఆ నా డేమిటో అనుకున్నాగాని యిప్పు డనుభవిస్తున్నా. ఆడవాళ్ళకి శ్వేచ్ఛ నిచ్చామన్న

ఆదర్శ వాదులంతా ఆచరణలో మాత్రం ఆడవాళ్ళని ఆటవస్తువులుగా చూస్తున్నారు. స్వేచ్ఛ ననుభవిస్తున్నామన్న ఆడవాళ్ళంతా మొగాళ్ళ చేతుల్లో నలిగి నశిస్తున్నారు. నిజం చెబుతున్నా చెల్లీ! అలాంటి చదువూ సంస్కారమూ లేకపోవడంవల్ల నువ్వేంతైనా అదృష్టవంతురాలివి.

గౌరి.– (కష్టంతో చి) అక్కా! అలా అనకక్కా!

స్వేచ్ఛ.– లేదు చెల్లీ! చేసిన పాపాన్ని చెప్పనీ చెల్లీ! యీ శరీరం ఓ మురికికూపం. ఇవి రక్తనాళాలు కావు చెల్లీ, మురికికాల్వలు. ఇది హృదయం కాదు చెల్లీ, విలాస పురుషుల వుద్యానవనం. (అని కుమిలి, కుమిలి ఏడుస్తుంది)

గౌరి.– అక్కా! ఏడవకక్కా! మానసాన్ని చంపుకొని యిలా జీవించేకంటే బావతో సంసారాన్ని చేసుకు జీవించకూడదా? అక్కా!

స్వేచ్ఛ.–బావ!... చెల్లీ! నా సంసారాన్ని నా చేతులారా కూలద్రోసుకున్నా. విశాలప్రపంచంలో స్వేచ్ఛగా విహరిద్దామని, ఏవేవో ఆశలు పెట్టుకొని— వాళ్ళమాటలు విని మోసపోయాను.

గౌరి.– వాళ్ళు?... వాళ్ళు నీ దగ్గరికే వచ్చేరా? అక్కా!

స్వేచ్ఛ.– ఆ. వాళ్లు వచ్చారు.

గౌరి.– మా సంసారాన్ని పాడుచేసారు. ఒప్పించేరు. మెప్పించేరు మాటలతో – విప్లవంలోకి దూకించారు. ఆ

ప్రపంచంలోంచి యీ పాడుప్రపంచంలోకి తెచ్చారు. నా భర్తని నాకు దూరంచేశారు. నన్ను నాశనం చెయ్య బోతున్నారు.

స్వేచ్ఛ.– లేదు. నిన్ను నాశనంచేయలేరు. నీలాంటివాళ్ళని నాశనం చేద్దామనేవాళ్ళే సర్వనాశనం అవుతారు. తొందరపడకు? చెల్లీ! తొందరపడే నే నింతవరకూ తెచ్చుకున్నా. నేనేకాదు ఎంతోమంది...

గౌరి.– ఆ! నువ్వుకాక ఇంకా వున్నారా? అక్కా! ఏం? అక్కా! నాకంటే తెలివైనదానివే! చదువుకున్నదానివే! తెలిసుండీ ఇలాచేశావా?

స్వేచ్ఛ.– చేశాను. ఎలాగనుకో... చేశాను. విను. ఆ నాడు నేనూ మీ బావ మీటింగుకి వెళ్ళాం. అవి ఆ రోజులు. నేనూ మీబావ వాళ్ల మాటల్లోపడ్డాం. ఆ రోజు వాళ్ళ మీటింగుకి వెళ్ళేం. అక్కడ...

(తెర వాలును)

## ౫-వ రంగంలో రెండవ భాగం

(తెర ముందుభాగమున మీటింగుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయ వలెను. ఒక టేబిలు, మూడు కుర్చీలు, రెండు పూలదండలూ, ఒక మైకు సిద్ధంచేయవలెను. మైకుముందు ఓయువకుడు రేగినజుట్టూ, ప్లాస్టిక్ కళ్ళ జోడూ, గ్లాస్కో డ్రెస్సుతో ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లు మాటిమాటికి వాచీ చూసుకుంటూ వుంటాడు. హాల్లోని సభాసదులను వీక్షించి)

యువ.– కామ్రేడ్స్! పదినిముషాలాగండి. వారికోసం కారు పంపేం. యీపాటికే వస్తూవుంటారు.

(ఇంతలో కారు హారన్ వినబడుతుంది)

యువ.– అడిగో! వచ్చారు. (వారిని చూస్తూ) హల్లో కామ్రేడ్ సుందరం...

(సుందరం, సరోజ ప్రవేశం)

సుందరం.– (కరస్పర్శ చేస్తాడు) కామ్రేడ్! చాలా ఆలస్యమైంది. క్షమించాలి.

యువ.– అయిన ఆలస్యం ఎలాగయినా, మీ సతీమణి రావడంచేత మీటింగుకి క్రొత్తశోభ వచ్చింది. నమస్తే!

సరోజ.– నమస్తే!

యువ.– యీ రోజు చాలా సుదినం. యిలాంటి మీటింగులకి మీవంటి విద్యావతులురావడం చాలా శుభసూచకం. కమాన్ కామ్రేడ్స్!

(సుదరం, సరోజ చెరియొకవైపున కుర్చీలలో కూర్చొని మధ్య కుర్చీ ఖాళీగా వుంచుతారు.)

యువ.– (మైకుముందు నిలువబడి) కామ్రేడ్స్! మనం కొన్ని సంవత్సరాలనుండీ హక్కులకోసం పోరాడుతున్నాం. ఏ వేవో ఆశలు, ఆశయాలు పెట్టుకున్నాం. కలలు కంటున్నాం. యీ నాడు అవి సిద్ధించే కాలంవచ్చింది. చిరకాలంనుండీ సాగిస్తున్న విప్లవం యీనాడు పరిపక్వ దశకు వచ్చింది. పక్వానికొచ్చిన రాచ కురుపుని కోసినట్లు యీ బూర్జువా విధానాన్ని విప్లవఖడ్గధారచే తెగకోసేస్తాం. ఇటువంటిపవిత్రమైన కార్యానికి మీ

అందరి సహకారం వుండాలి. ఐతే మనం అనుకున్న రాజ్యం వస్తే మీ కందరికీ ఎంత సౌకర్యం చేకూర్తుందో వేరే చెప్పనక్కర్లేదు. అది తెలుసుకొనేందుకు విదేశం నుంచి కావలసినంత సారస్వతం తీసుకొచ్చి మీ ముందు పడవేశాం. అవి చదువుకోండి తెలుస్తాయి. అప్పుడే ఆ సారస్వతం విద్యార్థుల వంటికెక్కి ప్రతి రక్త నాళాల ల్లోను పరుగులెడు తున్నాయి. హార్లిక్సులో వున్న రుచి అమ్మపాలలో లేదని ప్రజానీకం తెలుసుకుంది. మా అవిరళ మైన కృషి చేత తెలుసుకొనేట్లు చేసాం. అందుకే మీ రందరూ ఇంత శ్రద్ధగా యిక్కడికివచ్చారు. ఈ మీటింగు మిమ్మల్ని విప్లవంలో పాల్గొనమని చెప్పడానికే ఏర్పాటు చేశాం. కనుక ఇటువంటి మీటింగుల్లో చరిత్రప్రసిద్ధం కావాలంటే నే నొక్కటి కోరదలచుకొన్నా ... ఎవరిని? ...కామ్రేడ్ సుందరంగారి సతీమణి "సరోజ"గార్ని.

సరోజ<br>సుందరం } (ఆశ్చర్యంగా చూస్తారు.)

యువ.— (సరోజవైపు తిరిగి) సోదరీ! యీ కార్మికులందరి తరఫున మిమ్ము కోరుతున్నాను. ఈనాటి సమావేశానికి అధ్యక్షత వహించవలసిందని.

సరోజ.— (భర్తవైపు ప్రశ్నార్థకంగా చూస్తుంది)

సుందరం.— (ఏమన్నా అగారంగా వుంటుందని నేత్రాలతో అంగీకారం తెలుపుతాడు.)

యువ.— వచ్చి అధ్యక్షస్థానాన్ని అలంకరించవలసినదిగా కోరుచున్నాను.

సరోజ.— (చేసేదిలేక అధ్యక్షస్థానాన్ని అలంకరిస్తుంది.)

యువ.— (వెంటనే పుష్పహారాన్ని ఆమెకు, సుందరంగారికీ సమర్పిస్తాడు. అందరూ చప్పట్లుకొడతారు.)

యువ.— (మైకుముందుకువచ్చి) కామ్రేడ్! యీరోజు మీ అందరి సమక్షంలో యీ సభాధ్యక్షస్థానాన్ని అలంకరించిన యీ వనితామణి కామ్రేడ్ సుందరంగారి సతీమణి శ్రీమతి సరోజ B. A. గారు. (చిన్న చిరునవ్వు)

సరోజ.— (అత నొసంగిన గౌరవానికి సంతోష సూచకంగా చిరునవ్వు వహిస్తుంది)

సుంద.— (మూఢభావ ముఖలక్షణాలు కలిగి వుంటాడు)

యువ.— సరోజ! నిజంగా సరోజే! యీ సభాసరోవరంలో సరోజగా భాసిల్లి పేరు సార్థకం చేసుకున్నారు.

(అందరూ చప్పట్లు కొడతారు)

సరోజ.— (ఆనందంలో మురిసిపోతుంది)

యువ.— ఇప్పుడు మన మందరం ఆమె వొసంగబోయే మహోపన్యాస మకరందాన్ని గ్రోలే తుమ్మెదల్లా చేరేం. ముఖ్యంగా నేను వారి వుపన్యాస మకరందాన్ని రుచి చూచే భాగ్యం కలిగినందుకు ఎంతగా సంతోషిస్తున్నానో చెప్పలేకపోతున్నాను. ఈనాడు ఇటువంటి విద్యా

వతులు కార్మిక కర్షకలోక సముద్ధరణకోసం నడుం కట్టేరంటే విజయ సూచకమే! ఇకమీదట ప్రతి స్త్రీ పిచ్చి పిచ్చి భావాలు, ఆచారాలు విడిచి తెగించి ముందుకువచ్చి దరిద్రంతో బాధపడుతూన్న కోటాను కోట్ల ప్రజల్ని వుద్ధరించడానికి పూనుకోకపోతే ప్రపంచం సర్వనాశనమౌతుంది. సీత, ఝాన్సీలక్ష్మిబాయ్, సావిత్రి, మీరాబాయ్, ద్రౌపది, పద్మిని, రుద్రమదేవి, మల్లమదేవులవంటి ఉత్తమ స్త్రీలకు నిలయమైన భారత భూమిలో స్త్రీల శౌర్యత్యాగాలకి లోటులేదు. ఆ విశ్వాసం వుండబట్టే మనం యీ వుద్యమాలకు పూనుకున్నాం. వారివలెనే నేటి స్త్రీలుకూడా వంటింటిలో మగ్గకుండా, అత్తగారి ఆర్భాటాలకు లొంగకుండా, నడివీధిలో నిలబడి శంఖం పూరించాలి! ఢంకా మ్రోగించాలి! విశ్వమానవ కళ్యాణానికి వీధి వీధులా తిరగాలి! ప్రతి గుమ్మం ఎక్కాలి! చెవి నిల్లుకట్టుకొని చెప్పాలి! విప్లవం తేవాలి! శ్రమజీవుల రాజ్యం స్థాపించాలి!

(అందరూ చప్పట్లు కొడతారు)

సరోజ.— (ఆమెకేదో ఘనత వచ్చినట్లు, నిజంగా తమె కంపకూ ఆధిక్యత నిచ్చినట్లూ భావించి క్షణక్షణానికి ఉత్సాహాన్ని విరజిమ్మే ముఖలక్షణాలతో గోచరిస్తుంది)

యువ.— కాలం అంతా నేనే అపహరించాను. ఇక శ్రీమతి సరోజగారు, వారి వుపన్యాస మకరందాన్ని వెదజల్లి దరిద్ర జ్వాలలతో మండే హృదయాలకు ప్రశాంతత కలి

గిస్తారని ఆశిస్తున్నాం, నమస్తే! (అని ప్రక్క కుర్చీలో ఆశీనుడౌతాడు)

సరోజ.— (లేచి వుత్సాహంతో మైకుముందుకు వస్తుంది)

సుంద.— (ముభావంగా వుంటాడు)

సరోజ.— నమస్తే! కామ్రేడ్స్! నా గురించి ఎంతగానో చెప్పిన కామ్రేడ్ కి కృతజ్ఞురాలను. (అతనివైపు చూచి నవ్వుతుంది)

యువ.— నవ్వుతోనే సమాధానం ఇస్తాడు.

సరోజ.— నేను కార్మికులకి, కర్షకులకి సేవ జేస్తాను. నా జీవిత సర్వస్వాన్నీ అర్పిస్తాను. మీరంతా ధనవంతుల చేతుల్లో నలిగి బాధపడుతున్నారు. వాళ్ల హయాం అంతరించి మీ రాజ్యం రావడానికి నేనూ కృషిచేస్తాను. కామ్రేడ్స్ నిజం చెబుతున్నా. నేను B. A. పాసయేనేగాని కాలేజీ విడిచిన నాటినుంచి వంటింట్లోనే మ్రగ్గుతున్నా. ఈనాడు మీరు నా కొసంగిన ఘనస్వాగతానికి నే నెంతో సంతోషిస్తున్నా. ఈనాటికి కళ్లు తెరిచా. ఆ వంటింటి జీవితం కన్నా యీ జీవితం ఎంతో మధురంగాను, మనోహరంగానూవుంది. ఇంక నే నిలాగే జీవిస్తా! నా సర్వస్వం ధారవోస్తా! మహిళాలోకాన్ని ముందుకి తీసుకొస్తా! లోకశాంతి చేకూరుస్తా! శంఖం పూరిస్తా! ఢంకా మ్రోగిస్తా! విప్లవం తెస్తా! (ఆయాసం తీర్చుకొనే నిట్టూర్పుతో) కామ్రేడ్స్! ఇక నేను చెప్పవలసింది యేమీ లేదు. అంతా కామ్రేడ్స్ చెప్పేసేరు. నమస్తే!

(ప్రోగ్రాం కాగితంచూసి శ్రీ సుందరంగారు మాట్లాడుతారు)

సుంద.– (లేచి మైకుముందుకొచ్చి) సోదరులారా! నేనేం చెప్పేసి? ఏం చెప్పాలో తెలియడంలేదు. ఇకమీదట నేనేది చెప్పేది మహిళలే! సావిత్రి, అనసూయల్లా వీధి లోకివచ్చి శంఖాలు పూరించి విప్లవం తెచ్చేది మహిళలే. ఆడది పూనుకుంటే ఎలాంటి విప్లవాన్నైనా తెస్తుంది. అందుకే మేమూ చూస్తున్నాం. మన దరిద్రాన్ని కోల్పోయి ఆడవాళ్ల చేతుల్లో హాయిగా యెప్పుడు సుఖిస్తామా? అని ఎదురుచూస్తున్నాం... నమస్తే! ఇంత కన్నా యీ రోజుల్లో మగాళ్లు ఎక్కువగా వుపన్యాసాలివ్వడం మంచిదికాదని నా వుద్దేశం. అంచేత విరమిస్తా! (కూర్చుంటాడు)

యువ.– (మైకుదగ్గరకు వచ్చి) ఈ నాటిసభ జయప్రదంగా జరిపించిన అధ్యక్షులవారికి, శ్రీ సుందరంగార్కి మీ అందరికీ పునః కృతజ్ఞత తెలియజేస్తున్నా. శ్రీమతికి, మీ రందరూ విచ్చేసి ఓపిగ్గా విన్నందుకూ, కోరినవెంటనే యీ మైకుని, యీదీపాలని సప్లైచేసిన ఎలక్ట్రిక్ కంపెనీవార్కీ, నా కృతజ్ఞత. నమస్తే! (అందరూ నిష్క్రమింతురు.)

(తెరవాలును)

## 3-వ రంగములో మూడవ భాగం

[ సుందరం ఇంట్లో ఓ గది. సామాన్యంగా అలంకరించబడి వుంటుంది. నీటుగా వుంటుంది. పర్చీమీద కూర్చుని, టేబిలు పైనున్న అద్దం చూచుకొని తల దువ్వుకొంటూంటుంది సరోజ ]

సైకిల్ బెల్ వినబడి పేపరుసార్ అనే కేకతోబాటు పత్రిక ఇంట్లోకి విసరబడుతుంది. (విశాలాంధ్ర పత్రిక)

సరోజ.— (వుత్సాహంతోపోయి పేపరు అందుకొని ఆతృతగా విప్పి వెతికింగుచూచి సంతోషం పట్టలేని ముఖకళతో చదువుతుంది.) "వేలాది కార్మిక సమూహంలో శ్రీమతి సరోజగారి గంభీరోపన్యాసం"......

కార్మిక కర్షక సముద్ధరణకై శ్రీమతి సరోజాగారి ముందడుగు. సరోజాగారు మహిళాజాతికే ఆదర్శ స్త్రీ. (సంతోషం పట్టలేక పేపరు హృదయానికి హత్తుకొని నిమీలితనేత్ర అవుతుంది.)

సుంద.— (ప్రవేశం— ముఖం చిట్లించుకొని రాగానే కోటు విప్పుకొనబోవగా)

సరోజ.— (సంతోషంతో) ఏమండీ! తరువాత యిప్పండి! కోటు ముందీ పేపరుచదవండి.

సుంద.— ఏమిటో! కొంప మునిగిపోయే విషయం.

సరోజ.— చూడండీ మీకే తెలుస్తుంది. (అనిపేపరుయిస్తుంది.)

సుంద.— అలాగా! ఏదీ! (అని పేపరుతీసుకొని చదువును.)

"వేలాది కార్మికసమూహంలో శ్రీమతి సరోజాగారి గంభీరోపన్యాసం. కార్మిక కర్షక సముద్ధరణకై శ్రీమతి సరోజాగారి ముందంజ. శ్రీమతి సరోజాగారు మహిళాలోకానికే ఆదర్శ స్త్రీ"... అబద్ధం. (పేపరు విసరికొట్టి) పచ్చి అబద్ధం. (కోటువిప్పి పాగా కొయ్యకు తగుల్చును.)

సరోజ.— (నిర్ఘాంతపోయి నోట మాటలేక చూస్తుంది.)

సుంద.– ఇందు కేనా ! కొంపమునిగినట్లు చెప్పేవ్ !

సరోజ.– (పట్టరాని కోపంతో పేపరుతీసి) ఛీ! ... సహించ లేని మగాళ్లు. మీకు చూపించడం నా బుద్ధిపొరపాటు. యీ ప్రపంచంలో మీరొక్కరు మెచ్చుకపోతే నన్ను మెచ్చుకొనేవాళ్లు లేరనుకొన్నారా ? పుస్తకట్టేరని అంత నీచంగా చూస్తారా ?... ఏం ?... పేరు ప్రతిష్ట మగాళ్ళ కేగాని, ఆడవాళ్ళ కక్కర లేదా ?... ఇంతమాత్రంచేత నాకొచ్చిన నష్టంలేదు.

(అని లేచేస్తూలో కాలు పెడుతుంది.)

సుంద.– ఎక్కడికా ప్రయాణం ?

సరోజ.– క్లబ్బుకి.

సుంద.– ఎందుకు ?

సరోజ.– మీటింగుంది. (అని జోళ్ళు తొడుగుతుంది.)

సుంద.– వెళ్ళడానికి వీల్లేదు.

సరోజ.– వీల్లేదూ ? హు ! ...ఎందుకు వీల్లేదు ? వేలాది ప్రజానీకం ఎలుగెత్తి పిలుస్తూ ఆడవాళ్ళకి అఖండ స్వాగతాలిస్తూంటే...నువ్వొక్కడివి పుస్తకట్టేనని అడ్డు పెడితే స్త్రీలోకం ఆగిపోతుందా ? వెళ్ళి తీరాల్సిందే ? (అని ఒక్క విసురున పోతుంది.)

సుంద.– సరోజా ! సరోజా ! ఆగు ! ... ఆగు ! ...

(అంటూ వెంటబడతాడు.)

( తెరవాలును )

— అనుబంధం —

(తెరలేచును. తెల్లని గోడలతోనున్నగది. మధ్య టేబిలు, రెండు కుర్చీలు వుంటాయి.)

సరోజ.– (ప్రవేశం. చేత పుష్పాలదండలు, ఒకచేత పేపరు. రాగానే భారంగా కుర్చీలో కూలబడుతుంది. తన భర్తతో జరిగిన సంభాషణ జ్ఞాపకం వస్తుంది.

(తెరవెనుకనుంచి)

సుంద.– "అబద్ధం! పచ్చి అబద్ధం! ఇందుకేనా కొంప మునిగేటట్లు చెప్పేవ్!"

సరోజ.– ఛీ! సహించలేని మగాళ్ళు"

ప్రజ.– "జై! సరోజగారికి జై! ఆదర్శ మహిళామణికి జై"

కామ్రేడ్స్.– "నిజంగా సరోజాగారు కార్మికలోకానికి అపార సేవ చేస్తున్నారు. ఆదర్శమహిళ. అపార త్యాగశీల."

(ఇలా స్మరించుకొంటూవుండగా వెంటనే కామ్రేడ్ ప్రవేశం.)

కామ్రేడ్.– నమస్తే! ఆ! హా! హా! హా! ఎంత గంభీరంగా చెప్పేరు! ఇప్పటికీ ఆరూపం నాకళ్ళకి కట్టినట్లు కనిపిస్తున్నది.

సరోజ.– (వెంటనే తెలివితెచ్చుకొని) ఆ! ...ఏరూపం? ... ఏరూపం కామ్రేడ్?

కామ్రేడ్.– అదే ఆ రూపమే! ... ఆ నునుపారు చెక్కిళ్ళు! ఆ విశాలనేత్రాలు! బల్లగుద్ది వుపన్యాసం చెబుతుంటే

ఎఱ్ఱగా పూచిన గులాబుల్లా కనుపించేయ్. నేను హాడలి పోయాను. ధనవంతుల మేడలు కదలిపోయాయి.

సరోజ.- (విచారసూచకంగా మౌనం వహిస్తుంది.)

కామ్రేడ్.- (అదిచూచి) అరె! ఏం? అలావున్నారు.

సరోజ.- ఛీ! సహించలేని మగాళ్ళు.

కామ్రేడ్.- ఆ!

సరోజ.- ఆడదాని పేరుప్రతిష్ఠలు చూచి సహించలేని మగాళ్ళు.

కామ్రే.- ఎవరూ? —నేనా? నేనలాచెయ్యనే—ఆడదాన్ని పువ్వుల్లో పెట్టి పూజిస్తాను. ఆడదాని అడుగులకు మడుగు లొత్తుతాను. ఇంకా ఏమైనాచేస్తా. అంతేగాని ఆడదాన్ని విరోధిస్తే గగ్గోలై పోతుంది. లోకశాంతి నశిస్తుంది. తలక్రిందులై పోతుంది ప్రపంచమంతా.

సరోజ.- కామ్రేడ్! అందరూ నీవంటివాళ్ళే వుంటారా? నీవంటి విశాలహృదయులే వుంటారా? ఏం చెప్పను? నా పేరుప్రతిష్ఠలు చూచి నా భర్తే సహించలేకపోతున్నా డంటే — చెప్పుకోడానికి సిగ్గేస్తోంది. ఎంతో సంతోషంతో పేపర్లోపడిన వ్యాసాన్ని చూపిస్తే, విసరి ముఖంమీద కొట్టేడు. నా హృదయంలో బాకుపోటు పొడిచినట్లైంది. అతనిమీద అసహ్యం పుట్టి చక్కున వచ్చేశాను. (అని దుఃఖావేదనతో టేబిలుమీద వాలుతుంది.)

కామ్రే.– దుర్మార్గుడు ఎంతపని చేసేడు! (అంటూ కంపిస్తున్న తత్తరపాటుపడుతున్న మాటలతో కుర్చీ వెనుకకు వెళ్ళి ఆమె రెండుభుజాలు పట్టుకు లేవతీస్తాడు. శిరస్సు నిమురుతూ చేతులుచెక్కిళ్ల మీదకుపోనిచ్చి) ఊరుకోండి. అంత మాత్రంచేత అతను పెద్దవాడూకాడు – మీరు చిన్నవాళ్లూకాదు.—ఆనాడు పత్రికలో పడ్డ మీ వుపన్యాసం చదివేను. ఎంతగా సంతోషించానో నేనే చెప్పలేను.— నేనే చెప్పలేను. (అని పదేపదే అంటూ ఆమెను కుర్చీతో సహా కౌగలించుకుంటాడు.)

సుంద:—(అదేసమయానికి ప్రవేశం) సరోజా! (అని అడుగు ముందుకువైచి, ఆదృశ్యంచూచినిర్ఘాంతపోతాడు.)

సరోజ:– భయంతో అదిరిపోతుంది.

కామ్రే.– (త్రుళ్లిపడి ప్రక్కకి తప్పుకుంటాడు.)

సుంద.– (ఉద్రేకంతో) ఆ! —ఆ! — దుర్మార్గురాలా! పురుషులతో భుజాలుకలుపుకొని చేసేప్రజాసేవ యిలానే వుంటుందని లోకానికి వెల్లడిచేశావ్. ఇంకాచాలదు. పురుషులతోసమానంగా స్వేచ్ఛకావాలనే స్త్రీలకు నిజానిజాలు తెలిసేందుకు, నాదాంపత్యాన్ని త్యాగంచేస్తున్నా. అచ్చుగ్రుద్దిన ఆబోతులా ప్రపంచంమీద విడచిపెడుతున్నా. ఫో! ఫో! స్వేచ్ఛగా ఫో! (అంటూపోతాడు)

సరోజ.– ఆ! ఆ! ఆగండి! ఆగండి! (అంటూపోబోయి పడిపోతుంది.)

(తెరవాలును)

## 3-వ రంగం-చివరిభాగం.

శ్వేచ్ఛ.- అలా జరిగింది చెల్లీ! తరువాత విప్లవం వచ్చింది. శ్రమజీవుల ప్రభుత్వం వచ్చింది. వెంటనే శాసనం చేసింది. బానిసత్వాన్ని కట్టబెట్టే వివాహతత్వం నశించాలని.

గౌరి.- ఆ! శాసనం చేసిందా!

శ్వేచ్ఛ.- అవును. శాసనం చేసింది. అందుకే నిన్ను నీ భర్తనుండి వేరుచేసింది. ఇకమీదట నువ్వూ ఒక మొగాడిలా వుద్యోగం చేసుకొని నీ యిష్టంవచ్చినట్లు తిరగమని, సుఖపడమని నీకు చెప్పమంది. ఇది ప్రభుత్వ ఆజ్ఞ. ఫిరంగిగుండుకన్నా తీవ్రమైనది.

గౌరి.- (భయంతో) ఆ! (కాళ్లు పట్టుకొని) నన్ను రక్షించు అక్కా. నా శీలాన్ని కాపాడు. ఈ ప్రభుత్వానికి నన్ను వప్పచెప్పకు. నా జీవితాన్ని పాడుచెయ్యకు. ఆ నరక కూపంలో నన్ను పడేయకు.

శ్వేచ్ఛ.- (లేవనెత్తి) చెల్లీ! (అని ముఖంచూచి కండ్ల నీరు కారుస్తూ) భయపడకుచెల్లీ! నిన్నా నరక కూపంలో పడేయను. ఇంతకాలంనుంచీ జీవితంమీద రోతబుట్టి పశువుకుమల్లే తిని తిరుగుతున్నాను. కాని, ఇప్పుడు నీ కోసం, నీ శీలాన్ని కాపాడడంకోసం మనం ప్రభుత్వం చేతుల్లో చిక్కకుండా ప్రచ్ఛన్నంగా తిరుగుదాం.

గౌరి.— అమ్మో! నెయ్యికళ్ళు పెట్టుకొని చూస్తున్న యీ రాజ్యంలో తప్పుకుతిరగడం ఎలా? ఒద్దు. అంతకంటే ఆత్మహత్య చేసుకోడం మంచిది. తిరిగి వాళ్ళచేతుల్లో పడ్డానూ! మహా నరకాన్ని పొందవలసి వస్తుంది.

స్వేచ్ఛ.— భయంలేదు చెల్లీ! ప్రజానీకం అంతా ప్రభుత్వ విధానాన్ని, నిరంకుశత్వాన్ని, నిరశిస్తోంది. భారత పతివ్రతలగడ్డపై యీ దారుణాన్ని స్త్రీలు సహింపలేక పోతున్నారు. కండలు కొండచేసుకుని కష్టపడే కర్షకుడు యీనాడు సెంటు భూమిపై కూడా అధికారం కోల్పోయాడు. రక్తం ధారవోసి కష్టించే కార్మికుడు అర్ధణా లాభానికి కూడా నోచుకోలేదు. వీళ్ళందరూ మనకి సహాయపడతారు. ప్రజాస్వేచ్ఛ అరికట్టే ప్రభుత్వం ఒక్క క్షణంకూడా వుండదు. పద పోదాం! ఆ పల్లెటూరి పొలిమేరలకు. ఆ పూరిగుడిశలలో తల దాచుకుందాం రా! రా! చెల్లీ!

(నిష్క్రమిస్తారు—తెర వాలును)

## 4-వ రంగము

[ అది ఒక రైతుపొలం. వెనుక అడవినీనూ రంగంమీద ఏవో! కొన్ని పొలానికుండవలసిన గుర్తులు.

పగిడీచుట్టి, కచ్చగట్టి, చేత జాణాకఱ్ఱ రెండవచేత కొడవలి పట్టుకొని ఓ రైతు వస్తాడు. ]

రైతు.— (ప్రొద్దుకేసిచూసి) ఆరె! ఎంత పొద్దెక్కింది! (ఇంతలో దూరాన ఏదో కనబడినట్లు నటించి) ఓహో!

ఏటాగోల ? మా హడావుడిగావుందే! అబ్బోరంబాబు ! ఏంటా ధూళి ? ఆకాశాన్ని క్రమ్మేసిందే ! (నిదానించి చూసి) అది మినిస్ట్రీవాగుండే ! హా! హా! హా! ఓరి, దీనింటా పటాలంగానూ ! అవన్నీ పశువులా ?

"బాం ! బాం ! బాం !" (లారీల చప్పుడు)

ఓరి దీనింటా పటాలంగానూ ! ఆవెనకాల మినిస్ట్రీలారీలు. ఏం ప్రభుత్వం ? ఏంప్రభుత్వం ? అదిగలావుండాలి పాలన. అన్ని పశువుల్నీ ఒక్క త్రాటిమీద నడిపిందే ప్రభుత్వం. ఆరె – దీనింటా పటాలంగానూ ! నోరులేని పశువులన్నీ ఎం చగ్గానడుస్తున్నాయ్ ! అదిగదిగో మా పాలంకాడ్నుంచి పోతున్నాయే !

(ప్రవేశం : విశ్వప్ప కుఱ్ఱవాడు)

విశ్వప్ప.– (సంతోషంతో) పెద్దయ్యా ! పెద్దయ్యా !

రైతు.– ఏటా ?

విశ్వ.– బావొచ్చేడు పెద్దయ్యా ! పట్నంకాడ్నుంచి.

రైతు.– ఆ ! ఎప్పుడు? ఎప్పుడొచ్చాడ్రా ?

విశ్వ.– ఇప్పుడే నీకాడికే వస్తున్నాడు.

రైతు.– ఆ ! అదిసరేగాని దీనింటాపటాలంగానూ మన పాకాడ ఏదో గందరగోళంగావుంది చూడు! (అని చూపుతాడు.)

విశ్వ.– ఆ ! నారీలు !

రైతు.— జేగెళ్ళు! జేగెళ్ళు! పాకలో పశువులు బెదరిపార గలవ్!

విశ్వ.— (ఒక్క పరుగునపోతాడు)

వీరయ్య.— (ప్రవేశం. మతిచెడినవాడిలా వుంటాడు. మాసిన గడ్డం, పాతగుడ్డలు. దగ్గుతూ)

రైతు.— (ఆశ్చర్యంగా చూసి) వీరయ్యా?

వీర.— ఆ! (అంటూ నెమ్మదిగా చతికిల పడతాడు)

రైతు.— వీరయ్యా! ఇలా అయేవేం?

వీర.— ఏం?

రైతు.— ఆ? ఆముఖం ఏటి? ఆ వాళ్ళేటి? ఆ! పిశాచం లాగ యీా దగ్గెలా పట్టుకుంది?

వీర.— ఏ మొ!

రైతు.— అమ్మాయి, పిల్లలు కులాసా?

వీర.— హు! ... అమ్మాయి! ...

రైతు.— (విభ్రాంతితో) ఏంటి! వీరయ్యా! నీ మాటలు. ఒకదానికీ సమాధానం చెప్పవ్! అమ్మాయి పిల్లలు ఏలావున్నారు?

వీర.— ఎలావున్నారు! ... హాయిగావున్నారు. హుఁ ... వాళ్ళకేం! అందాలమేడల్లో హాయిగావున్నారు పిల్లలు.

రైతు.— అమ్మాయి ఎక్కడున్నట్లు?

వీర.– ఎక్కడో! ... ఏమో! ...

రైతు.– వీరయ్యా! ఏంటీమాటలు? (కసురుతూ)

వీరయ్య.– నామీదెందుకూ! అధార్టీ? నేనేంచేసేను? నాకేం తెలుసు?

రైతు.– నీకు తెలీదూ? ... నీకు తెలీకపోతే ఎవరికి తెలుస్తుంది! కట్టుకున్న పెళ్లాంసంగతి బర్తకి తెలీకపోతే ఇంకెవరికి తెలుస్తుంది!

వీర.– హః! హః! హు! భర్త! ... భార్య! ... తల్లి! తండ్రి! అంతావ్యామోహం! పిచ్చి! ఎవరికెవరూ లేరు!

రైతు.– (కోపదుఃఖాల మిళితభావంతో) ఏంటి! వీరయ్యా! యీమాట కేంటి? పెళ్ళాం లేదంటావ్ – పిల్లలు లేరంటావ్. ... ఏంచేశావ్? ఎవ్వరూ లేకపోతే ఎవరుండేది?

వీర.– హా! హా! హా! ప్రభుత్వం! ప్రభుత్వం వుంటుంది! శ్రీమంతుల ప్రభుత్వం! తల్లీ పిల్లల్ని, భార్యాభర్తల్ని, తల్లీ తండ్రిని వేరుచేసి అందరిమధ్యా విలయతాండవంచేసి హాయిగా వుంటుంది!

విశ్వ.– (ప్రవేశం. పరుగెత్తుకొని తలకు గాయంతగిలి రక్తం కారుతూవుంటుంది) పెద్దోడా! పెద్దోడా!

రైతు.– (గాభరాగా) ఆరె నీయింటా పబాలంగానూ... నెత్తురే! నెత్తురే! ఎవడ్రా? ఎవడికొచ్చిందిరా? పోగాలం?

విశ్వ.— గాయం! రక్తం! వెధవప్రాణం! పద! పద! మన పశువుల్ని తోలుకుపోతున్నారు. పెద్దోడా! ఎద్దుల్ని, లక్కోడ్దుల్ని, కత్తరగుల్ని తోలుకుపోతున్నారు పెద్దోడా! అడ్డినానని అమాంతంగా కొట్టేడు! అడ్డకి పరుగెత్తుకొచ్చా!

రైతు.— ఆడింటాపటాలంగానూ! ఎవట్రా?

విశ్వ.— ప్రభుత్వం! మినిట్రీపభుత్వం!

వీర.— హా! హా! హా! దాన్నే శ్రమజీవుల ప్రభుత్వమంటారు.

రైతు.— ఆ! ఎఱ్ఱజండాలు ఎగరేసి ఏమో వూడబొడుస్తా నన్న ప్రభుత్వం! మన పశువుల్ని తీసుకుపోతుందా! అలా జరగదు! జరగనివ్వను! రా! రా! విశ్వప్పా! అడుగుదాం. అన్యాయం అనిచెబుదాం. (అని వెళ్లబోగా)

"ఆగు!... ఆగు!... (అనే ధ్వనితోబాటు డిక్టేటరు చేత బెత్తంతో ప్రవేశం.)

రైతు, విశ్వ.— ఆగి, వెనుదిరిగి చూస్తారు.

డిక్టే.— ఆగు! ఎక్కడికి?

రైతు.— (నోట మాటరాక నిర్ఘాంతపోతాడు)

వీర.— (అతనివైపే నిర్లక్ష్యంగా చూస్తాడు)

విశ్వ.— ఇతండే పెద్దోడా! నా బుఱ్ఱ పగలకొట్టేడు. మన పశువుల్ని తోలుకుపొమ్మన్నాడు.

రైతు.— (ఆశ్చర్యంగా) ఆ!

డిక్టే.– ఏం ? ఎందుక్కూడదూ ? పశువుల్ని చంపాలి ! పశు మాంస వ్యాపారం పెట్టాలి. కార్మికుల కండపుష్టికి పశు మాంసం తినాలి ! అందుకు మీ పశువులు కావాలి !

రైతు.– అందుకని పశువుల్ని చంపుతారా ?

వీర.– అందుకని విచారిస్తావా ? సుఖపడ్డాయ్ !

డిక్టే.– ఎవరు నువ్వు ?

వీర.– ఓ పశువుని ? ... ...

రైతు.– నువ్వా ?

వీర.– ఆ ! నేనూ ! నువ్వూ !

డిక్టే – ఆపు ! మా ప్రభుత్వంలో పశువు లుండకూడదు.

వీర.– హా ! హా ! హా ! గొంగళికి వెంట్రుక లుండకూడదు !

డిక్టే.– (కోపంతో) చాలించు !

రైతు.– బాబయ్యా ! భారత దేశంలో పశువుల్ని దేవతల్లా చూస్తారు ! కుష్టమూర్తంతటివాడు ...

డిక్టే.– ఆపు ? నాకు తెలుసు. ఎవరోనల్లోడు ! దొంగవాడు ! పోకిరీవాడు....వాడా ? మీకు దేవుడు. వాడు చెప్పేడట, వీళ్లు చేస్తారట పశుపూజ ! యీ కనిపిస్తున్న సైంటిస్టులు, డాక్టర్లు, కవులు, కళాకారులూ, రాజకీయవేత్తలూ, క్రూరులూ, దగాకోరులూనా ? బ్రూటుస్ ! ఏం ! తల కాయల్లా ! మీవి ! పదహారు వేలమందితో పోయిన

పోకిరీవాడు. పెళ్లాన్ని ఎత్తుకుపోతే కొరగాని కోతుల్తో చెప్పుకొనేవాడూ, వీళ్లా మీకు దేవుళ్లు! దేవుడట! దేవుడు !... దేవుడు లేడు ...

రైతు.– ఆ! ... అలా అనకండి! వున్నాడు. అంతటా వున్నాడు.

స్ట్రైకే.– లేడు ... ఎక్కడా లేడు – వున్నాడంటే చిత్రవధ చేస్తాం. ఆ దేవుడు యీ రాజ్యంలో లేడు. ఈ దేశంలో లేడు ...

వీర.– హా! హా! హా! బాగా చెప్పేవ్! లేడు... దేవుడు లేడు.

రైతు.– ఆ! దేవుడు లేడూ! దేవుడు లేకపోతే ఎవరున్నారు.

వీర.– హా! హా! హా! దెయ్యాలు! హా! హా! హా! దెయ్యాలున్నాయ్.

విశ్వ.– (జడిసి) ఆ! దెయ్యాలా! పెద్దోడా! (అని గట్టిగా పట్టుకుంటాడు.)

స్ట్రైకే.– (కోపంతో) ఎవరు!... ఎవరు దెయ్యాలు!

వీర.– మీరు! మీరే! మాపాలిట దెయ్యాలు! పచ్చని మా సంసారాన్ని పాడుచేసిన దెయ్యాలు. దేశానికే దెయ్యాలు! లోకానికే దెయ్యాలు! ఆలుమగల్ని వేరు చేసిన దెయ్యాలు! అరవచాకిరీ చేయించుకొని అర్ధణా లాభాన్నివ్వని పిశాచాలు! కార్మిక కర్షక కండ్లలో కారంజల్లి, అధికారాన్ని చెలాయిస్తున్న దెయ్యాలు! మానవ హక్కుల్ని మంటగలిపిన మహిషాసురులు!

మీరే...మీరే పిశాచాలు! భూతాలు! దెయ్యాలు! అన్నీ మీరే!

డిక్టే.- ఆపు! (అని బెత్తంతో కొడ్తాడు)

వీర.- అబ్బా! (అని జుమాయిస్తాడు)

రైతు.- వీరయ్యా!

విశ్వ.- బావా! (అని ఏడుస్తూ డిక్టేటరునిచూసి) మాబావని ఎందుకు కొట్టేవ్?

డిక్టే.- పటప్! (అని బెత్తం ఎత్తుతాడు)

రైతు.- (వెంటనే కుర్రాడిని వెనక్కి తప్పిస్తాడు)

వీర.- మావా! ఫరవాలేదు. (అని కళ్ళు విప్పుతాడు.)

(ఇంతలో ట్రాక్టరు శబ్దం వినబడుతుంది.)

విశ్వ.- (భయంతో రైతుని కౌగలించుకుంటాడు.)

డిక్టే.- అదిగో ట్రాక్టరు! అదే మీజీవనాధారం! పదివేల పశువుల బలం. అదే! మీదైవం. దానితో వ్యవసాయం చెయ్యాలి! పశువ్యవసాయం నశించాలి!

రైతు.- బాబయ్యా! నాకున్నది నాల్గే ఎకరాలు. దాని కోసం ఇంతపెద్ద టాక్టరెందుకు? నా పశువులే నాకుచాలు.

డిక్టే.- హ! హ! నాల్గెకరాలా! చాలదు. సామాన్య రైతుకి నలభై ఎకరాలిస్తామని మాటయిచ్చాం. ప్రభుత్వంలో కొచ్చేం. అన్యాయంచెయ్యం. నలభై ఎకరాల

భూమినిస్తాం. వ్యవసాయ కేంద్రాలని స్థాపిస్తాం. న్యాయ్యం చేకూరుస్తాం.

వీర.— హః! ... నలభై ఎకరాలు!

రైతు.— ఎంతదయ! యీ ప్రభుత్వానికి ఎంతదయ! పేదోళ్ళ మీద ఎంతదయ! (సంతోషంతో) విశ్వప్పా! నలభై ఎకరాలా?

వీర.— హా! హా! హా! గొడ్డుమీద కసాయివాడి కెంతదయ!

(లాఠీల చప్పుడు బాం! బాం!)

రైతు.— (చూచి) అరెరే! విశ్వప్పా! కళ్ళంకేసిపోతున్నాయి మళ్ళించమన్నా? పోరా! పో?

విశ్వ.— (వెళ్ళబోగా)

డిక్టే.— ఆగు! (అని బెత్తం అడ్డుపెడుతాడు)

విశ్వ.— (చటాలునఆగి తెల్లబోయిచూస్తాడు)

రైతు.— ఆ!... ఏం? బాబూ!

డిక్టే.— ఏం? ఎందుకై తేనేకేం? నీపని నువ్వు చేసుకుపో!

రైతు.— ఆ!... నాపని? ... ఇదంతా నాపని కాదా? బాబూ! నా పొలం నే దున్నుకొని, నాపంట నే నాకట్టుకోడం నాపనికాక ఇంకెవరిపని? బాబూ!

వీర.— హా! హా! ప్రభుత్వానిది! నీదికాదు.

రైతు.- వీరయ్యా! పంటామాటలు! నాదే! ... అంతా నాదే! ... బోలెడు డబ్బోసి కొన్నాను. కష్టపడి పండిస్తున్నా!

వీరయ్య.- ఎవరికోసం? ... కష్టపడాలి! ... నువ్వేం కష్టపడ్డావ్! ఒక్కసారి పోయిచూడు? ఫ్యాక్టరీకి రాతుసి బొగ్గు పొగతో వూపిరితిత్తులు నిండిన ఆ కార్మికుల గుండెలు, మరుగుతూన్న ఇనుపకాగడాల దగ్గర వుండిపోతూన్న కార్మికహృదయాలు, వాళ్ళదీకష్టం. నీదేం కష్టం? అలాంటి కష్టజీవులకే "నాది" అని చెప్పుకు ముచ్చట పడేందుకైనా, పూచికపుల్ల ఆస్తిలేనప్పుడు నువ్వోకలెక్కా? పిచ్చివాడివి. నీకేం తెలీదు. నువ్వు కష్టపడాలి! పండించాలి! నలభై ఎకరాల భూమి పండించాలి! ఆ లారీల్లో వెయ్యాలి!

డిక్టే.- చాలించు! సరుకు లారీల్లో వెయ్యండి! పశువుల్ని తోలుకుపోండి? ... ఊ! ...

రైతు.- (ఇంతవరకూ మతిపోయిన వానిలావున్న రైతు ఆవేదనతో ప్రాధేయపడుతూ) వద్దు! ఆపండి! ఆపని ఆపండి! నాపంట నాకుదక్కనివ్వండి? నన్ను బాధించకండి! కండలు కొండలయేలా పెంచిన పశువులూపోయి, కష్టపడి సంవత్సరం పొడుగునా పండించిన పంటకూడా పోతే ... మేంకష్టపడి ఏం లాభం? మాకష్టానికిదేనా ఫలితం! ఇదేనా ధర్మం!

డిక్టే.- ఊ! వెయ్యండి? లారీల్లో త్వరగా?

రైతు.– అయ్యా ? అయ్యా ! వద్దు ! వద్దు ! మా కష్టాన్ని మా కివ్వండి. మమ్మల్ని వుసురు పెట్టకండి ? శ్రమజీవుల్ని రక్షించండి. ఇదేనా ? ధర్మం ? ఇంతేనా న్యాయం ?

డిక్టే.– షటప్ ! ఇంకేమి న్యాయం ? ఇదే న్యాయం. మీ దేవుడు చెప్పిన న్యాయం. "కర్మ చెయ్యాలి ? ఫలితం వదలాలి" దేశాన్ని పాలించేవాడికన్నా దేవుడు లేడు. ప్రభుత్వం అంటే దేవుడు. దేవుడు అన్యాయం చెయ్యడు. దేవుడు అధర్మం చెయ్యడు. ప్రభుత్వం కూడా అంతే ! ... మీ సర్వస్వం ప్రభుత్వం. మీరందరూ ప్రభుత్వ సేవకులు. భక్తులు ప్రభుత్వాన్నే స్మరించాలి ? ప్రార్థించాలి ? కవులు, కళాకారులు, కార్మికులు, కర్షకులు. ప్రభుత్వం కోసం కావ్యాలు వ్రాయాలి ! గేయాలు పాడాలి ! కర్మ చెయ్యాలి ! కలం పట్టాలి ! హలం పట్టాలి ! ఖడ్గం పట్టాలి ! అంతా ప్రభుత్వం కోసం చెయ్యాలి ! ప్రభుత్వాన్ని సమర్థించాలి.

వీర.– (వుద్రేకంగా) జై ! శ్రమజీవుల ప్రభుత్వానికీ ! ధర్మ రాజ్యానికీ...జై !

డిక్టే.– హా ! హా ! హా !

(లారీలు) బాం ! బాం ! బాం !

విశ్వ.– పెద్దోడా ! పనపంట పోతున్నది.

రైతు.–ఆపండి ! యీ అధర్మాన్ని ఆపండి ! మాకు దారి చూపండి.

డిక్టే.– హా! హా! హా! ఇదిగో! దారి. (అని ఓకార్డు చూపి స్తాడు.) ఇదే మీదారి. యీప్రభుత్వంలో ఎవడికైనా దారి ఇదే. యీకార్డు యీ అయిడెంటిటీకార్డు.

వీర.– హా! హా! హా! (తనదగ్గిర కార్డుతీసి) ఇదే! నశిం చిన మానవత్వానికి చిహ్నం! నేను మానవుడనని చెప్పు కోడానికి ప్రబలసాక్ష్యం! బానిసత్వానికి ప్రబలసాక్ష్యం! అవును. ఇదే! ... హా! హా! హా! ఇదే! హా! హా! హా!

(అని బిగ్గరగా నవ్వినందులకు గుండెనొప్పివచ్చినట్లు బాధపడుతూ క్రిందపడి మరణిస్తాడు.)

రైతు : విశ్వ.– వీరయ్యా! ... బావా! (అంటూ అతని మీదపడి గోలుమంటూరు.)

డిక్టే.– హా! హా! హా! ఎవ రక్కడ?

(వెంటనే మిలిటరీ యూనిఫారంలోనున్న సత్యం చేతతుపాకితో ప్రవేశం.)

సత్యం.– సెల్యూటు చేస్తాడు!

డిక్టే.– వీళ్ళని బంధించి తీసుకురా! ... (అంటూ వెళ్ళి పోతాడు.)

రైతు.– (ఏడుస్తూ) వీరయ్యా! మాయదారి గుండెజబ్బు నీకేలావచ్చింది వీరయ్యా! నాపిల్లగతి ఏంచేశావ్! వీరయ్యా! వీరయ్యా!

విశ్వ.– బావా! అక్కయ్యగతి ఏంగాను బావా! ఎంతోసరదాగా వుండేవాడివి బావా! (ఏడుపు)

సత్యం.— (ఇదంతా చూచి పెద్దగా నవ్వుతాడు) పిచ్చివాళ్లు!

రైతు.— (సత్యంవైపు తిరిగి) ఆ!... నవ్వుతున్నావా? మేం గంపెడుకష్టంలోవుంటే నీకు నవ్వేలా వచ్చింది?

సత్యం.— ఇంకా నవ్వుతాడు.

విశ్వ.— (కోపంతో) ఎందుకలా నవ్వుతావ్! నువ్వు మనిషివి కావు రాక్షసుడివి.

సత్యం.— అవును. నేను రాక్షసుడినే!... మానవ సమాజాన్ని, రూపుమాపే రావణాసురుడ్ని.

రైతు.— (కోపంతో) మీరు వాడికన్నా నీచులు. వాడికి దేవుడంటూ ఒకడున్నాడు. మీకు దేవుడూ, దెయ్యమూ కూడా లేరు. నా అల్లుడు చచ్చినాడని, నాకూతురు సంసారం నట్టేట్లో కలసిందని నే నేడుస్తూవుంటే ... నీకు నవ్వేలావచ్చింది?

సత్యం.— హా! హా! హా! (నవ్వు) ఆ! అందుకే నవ్వేను. మీరు వట్టి మూర్ఖులు. ప్రభుత్వంలో ఏం జరుగుతుందో తెలీదు. యీ రాజ్యంలో దిక్కు-మాలి ఎవ్వరూ ఉండరు. పిచ్చివాడా! ఇంకా నీకు తెలీదా? నీ కూతురు ఏనాడో నీ అల్లుడ్ని విడిచిపెట్టింది. ఎక్కడికో పోయింది.

రైతు.— ఆ!... ఎక్కడికో పోయింది?... పిల్ల లేమయ్యేరు?

సత్యం.— పిల్లలు!... హు!... పిల్లలకేం? శిశుసంరక్షణ శాలలో కోడిపిల్లల్లా పెరుగుతున్నారు. వేళకి తింటున్నారు, బడికిపోతున్నారు..

సత్యం.– పెద్దమ్మాయ్! వున్నట్టుంది. ఎంతపని చేసింది? అక్క.

రైతు.– (కోపంతో) ఛీ! నష్టముండ! కులంలో చెడ బుట్టింది! ఇంటిమర్యాదా తీసింది.

సత్యం.– హా హా! హా! వంశం! మర్యాదా! ఆడదానికి మగాడు, మగాడికి ఆడది ... ఎవరైనాసరే! ఎప్పుడైనా సరే! తప్పేంటి? కుక్కల్ని, పశువుల్ని, పక్షుల్ని, చూడలే? ఎక్కడో వుంది? వుద్యోగం చేసుకుని సుఖపడుతున్నా...!

రైతు.– (ఉగ్రుడై) ఆగు! నా కూతుర్ని నాశనం చేసింది. మీరు. మీ లాటివాళ్ళు! అన్నెమూ పున్నెమూ యెరుగని అమాయకుల్ని, పతివ్రతల్ని, ఆశలకు పురిగొల్పి – వాళ్ళ జీవితాల నర్ధాన్నం చేసిన రాక్షసులు మీరు! నీకు చీమూ, నెత్తురూ లేదూ? పదిమందితో నీ పెళ్ళాం పోతూంటే నీ కెలా వుంటుంది? (అంటూ మీదికి వెళ్తాడు.)

సత్యం.– (వెంటనే రైతు కంఠంముడి పట్టుకొని) ఛీ! నోటికొచ్చినట్లు పేల్తున్నావ్? ప్రభుత్వంతో చెలగాట మాడుతున్నావ్? (అని బైనెట్టు గుండెలమీద బెట్టి) నడువ్! ... ఊఁ! ... ఇనుప కటకటాల్లో మ్రగ్గి నశింతువుగాని ... ఊఁ! నడువ్!

రైతు.– (కదలక నిలువబడి) కాల్చు! ఊఁ! కాల్చు! యీ నరకంనుంచి, మీరు చెప్పే ఆ! ... "మరో ప్రపంచానికి" పంపేయ్!

విశ్వ.— పెద్దయ్యా! మా పెద్దయ్యని చంపేస్తున్నారు.
పెద్దయ్యా!

సత్యం.— (ఇంతలో వెనకనుండి ఢాం! అని రివాల్వరు పేల గానే) అబ్బా! (అని పడిపోవును)

రైతు.— ఆ! ... (అని ఆశ్చర్యంగా చూచును)

విశ్వ.— (అదిరిపడి రైతును కౌగలించుకొనును)

స్వేచ్ఛ.— (వెనుక గౌరి రాగా ప్రవేశం.)

రైతు.— ఎవరమ్మా? మీరు.

స్వేచ్ఛ — ఎవరైతేనేం? యీ దుష్టుడి బారినుండి తప్పించుకున్నాం. ఈ నియంత ప్రభుత్వ విధానానికి బలియైన పతితురాల్ని. ఇప్పుడు అజ్ఞాతవాసంలో వున్నాను. ఈదుష్టుడు మరణించాడు. ఒక్క-క్షణం ఇక్కడుంటే మనకూ యిదే గతి పడుతుంది. పద! పోదాం, పద!

సత్యం.— ఊ (మూల్గుతాడు)

స్వేచ్ఛ.— ఆ! ఇంకా చావలేదా? (అని రివాల్వరు గురిపెట్టబోతుంది)

గౌరి.— (తనకేదో బాధనిపించి) అక్కా! చంపొద్దక్కా! సగంచచ్చినవాడి నింకా యెందుకుచంపడం?

సత్యం.— వద్దు! యీపాపాత్ముడ్ని విడిచిపెట్టకండి! చంపండి!

గౌరి.— (మాటగుర్తెరిగిన దానివలె) ఎవరూ? ఎవరి వీమాటలు?

శ్వేచ్ఛ.— గౌరీ! ఏమిటి నీచాదస్తం?

సత్యం.— (ఆమాట వినగానే ఒక్కసారి శిరస్సుపైకెత్తి) ఆ! గౌరి! నాగౌరి!... నాగౌరి! (అని కళ్ళనీళ్లు పెట్టాడు.)

గౌరి.— (తన భర్తవిగ్రహం) ఏమోకేనా! (అంటూ అతని మీద పడుతుంది.)

శ్వేచ్ఛ.— గౌరీ!

రైతు.— అమ్మా! యీరిద్దరూ ఆలుమగలా?

శ్వేచ్ఛ.— (మనస్సున నేవో ఆలోచనలు రేకెత్త) అవును.

గౌరి.— అక్కా! వంటిమీద తెలివిలేదే! నా నాథుణ్ణి ఎలాగైనా బ్రతికించు!

రైతు.— అమ్మా! మరేం ఫరవాలేదు! యీపక్కనే పూరిపాకలోకి తీసుకుపోదాం! ఇతను చచ్చిపోలేదు. భుజం గాయపడింది.

శ్వేచ్ఛ.— (ప్రక్కనేవున్న శవాన్ని జూచి.) ఇతనెవడు? తాతా! ఇలా పడున్నాడు!

రైతు.— కన్నీళ్లు పెట్టి నిలబడతాడు.

విశ్వ.— మాబావ! చచ్చిపోనాడు.

శ్వేచ్ఛ.— పాపం! ఇలా ఎంతమంది ప్రాణాలు పోయినవో? విచారించకు. ఇక్కడ ఒక్కక్షణం వుంటే మనందరికీ, యింతకన్నా ఘోరమైన చావువస్తుంది. పదండి! పోదాం పదండి! (అంటూ సత్యాన్ని సాయంపట్టుతూవుండగా.)

( తెరపాలును )

## ౫-వ రంగము

(వెనుక అడవిసీను. కొండలలో కలబాచుకొంటున్న రహస్య ప్రదేశము.)

సత్యం – (ప్రవేశం. భుజమున గాయమునకు కట్టబడినకట్టుతో సాధారణవస్తులు ధరించి వచ్చును. ప్రకృతి సౌందర్యమును జూచి ఆనందించుచూ, చిరకాలమునుంచి జైలునందున్నవాడీ ప్రపంచము నెట్లు చూచునో యట్లు చూచుచూ, ఒకచో కూడ్చుని ప్రకృతిని తిలకిస్తూ పాడుచుండును.)

— గేయం —

పక్షులు మృగములు, కీటకాదులకు
ప్రసాదించిన, స్వతంత్రము
మానవులకు నిడ లేదా ? దేవా !
మాకేనా ? ప్రతిబంధకముల్ ! ॥పక్షు॥

పార్టీలంటూ, ప్రభుత్వమంటూ
పలుశాసనముల పాల్జేసి
విన్నది, కన్నది, వినిపించుటకును
స్వేచ్ఛే లేదా ? మనుజులకు ! ॥పక్షు॥

దేవుడు లేడా ? దిక్కే లేదా ?
దేనికైననూ ప్రభుత్వమేనా ?
అంతరాత్మలో నలజడియుంతా
అణగి, మణగి, అంతము యగుటేనా ? ॥పక్షు॥

మానవులంటే ! యంత్రములేనా ?
మానవత్వమన నింతేనా ?
యంత్రాగారాల్ చెంతను మనుజులు
జంతువులై పనిచేయుటయేనా ? ॥ సత్యం ॥

గౌరి – (అత్యుత్సాహంతో వచ్చి) ఏమండీ ? ఏమండీ ?

సత్యం.– (వెనుకకుతిరిగి) ఆ ! ... ఏం గౌరీ ! ఏం ?

గౌరి.– మా అక్క కనుపించడం లేదండీ !

సత్యం.– హా ! హా ! హా ! అవును. నాకు తెలుసు మీ అక్క కనుపించదని !

గౌరి.– ఆ ! ఏమిటీ ? మీతో చెప్పిందా ? వెళ్ళేటప్పుడు.

సత్యం.– హు ! నాతో ఎందుకు చెబుతుంది ? గౌరీ !

గౌరి.– ఏమిటండీ ? హాస్యాలు !

సత్యం.– ఇటువంటి సమయంలో హాస్యమాడుతానా ? గౌరీ !

గౌరి.– మా అక్క ఎంత మంచిదండి ! నాకోసం ప్రభుత్వంతో విరోధపడి, నన్నా పిశాచుల బారినుండి తప్పించి రక్షించింది.

సత్యం.– హు ! అవును గౌరీ ! నిన్నూ రక్షించింది. నన్నూ రక్షించింది. కాని. తానుమాత్రం పతితురాలై పోయింది.

గౌరి.– ఏమిటీ ! మా అక్కని మీకూ తెలుసా ?

సత్యం.– ఆ ! తెలుసు. నాకేమిటి ! నాలాటివాళ్ళ కెందరికో తెలుసు !

శాం.- (ఆశ్చర్యంగా) ఆ! ఏమిటి?

సత్యం.- ఎందు కాశ్చర్య పోతావ్? నామాటలు అబద్ధమైతే, అదిగో! ఆపుష్పాన్ని, ఆతుమ్మెదనీ చూశావా? ఆ పుష్పాని కలాంటి తుమ్మెద లెన్నిటినో తెలుసు! ఆ తుమ్మెద కలాటి పుష్పాల నెన్నిటినో తెలుసు.

శాం.- అంటే? మా అక్క అంత నీచురాలా? మీరు అక్కని అలాగే అంటారా? (కోపంతో అంటుంది.)

సత్యం.- ఇలా అంటానని వెళ్లిపోయింది. నీకు తెలీదు. అది వాళ్ళభాషలో నీచం కాదు. స్వేచ్ఛ! ... హు! పిచ్చి పిల్లా! కోపగించుకున్నావా? ఇలారా! (అని చెయ్యిపట్టు కొని కూర్చోబెట్టి) చెప్తా విను. ఆ రోజు అప్పుడే ఆఫీసు వదిలారు. సాయం సమయం. సాయంకిరణ ప్రసారం ఆ పార్కునకు ఎంతయో శోభ తెచ్చింది. నేను బందీ లోంచి వదలిన ఖైదీలా, ఆవేళ అక్కడికి వెళ్ళాను. అప్పుడు ...

(తెరవాలును)

## ౭-వ రంగము - అనుబంధము

[ పై రంగం - పై సీనేవుంచి పార్కు అని తెలియుటకు కొన్ని పూలగోలేలు, ఒక బెంచీ అమర్చవలెను. సాయంసమయకిరణాలు ఒక ప్రక్కనుంచి ఫోకస్ చేయవలెను. తెర ఎత్తేసరికల్లా... ]

స్వేచ్ఛ.- (పాశ్చాత్యనాగరికత వుట్టిపడేటట్లు తయారై, చేతిలో పేపరు, ప్లాస్టిక్ బేగ్ ధరించి, ఏదో ఉత్తరం

చూచుకుంటూ, ఆలోచనా నిమగ్న రాలై, విచారాన్ని, ఆవేదననూ సూచిస్తూ, మాటిమాటికి వాచీచూస్తూ కూర్చుంటుంది.)

సత్యం.- (ప్రవేశం) (సాధారణ యూనిఫారంలోవచ్చి, సిగరెట్ దమ్ము పీల్చి. ఆమెను నిఘూగాచూస్తూ) మీరు వైపిస్తుకదూ ?

స్వేచ్ఛ.- అవును-ఏం ? (చిరాకుగా)

సత్యం.- అహా! ఏమీ లేదు. మీరు ప్రతిరోజూ యీలా ఎందుకు కూర్చుంటారా ? అని.

స్వేచ్ఛ.- నాకు అలవాటు.

సత్యం.- ఇవాళ, రోజూకన్నా ముందుగా వచ్చేశారే ?

స్వేచ్ఛ.- క్షమించాలి! మీ ప్రశ్నలికి, సమాధానం చెప్పలేను.

సత్యం.- మీరు సమాధానం చెప్పనప్పుడు, నే నెలా క్షమించ గలను.

స్వేచ్ఛ.- ఏమిటీ వింతధోరణి ?

సత్యం.- మీకు కోపం వచ్చిందా ?

స్వేచ్ఛ.- నాకోపంతో మీకేం పని ?

సత్యం.- ఏమీ లేదు, చచ్చిచెడి యిప్పుడే వచ్చాను. ఇక్కడికిరాగానే హాయిగా వుంది! వేసవికాలంలో ఊరికే

ంచాా శలవును ఎలా పనియోగిద్దామా ? అని ఆలోచిస్తూ వుంటే, ఇంతలో మీారు కనిపించారు. నా ప్రాణం లేచి వచ్చింది. కాని, ఆగ్రహావేశంతో మీారు నిట్టూర్పు విడిస్తే నా వ్యూహాలు గాలిమేడల్లా కూలిపోతాయి.

స్వేచ్ఛ.– (కోపంతో లేచి) మీారు వెళతారా? నన్ను పొమ్మన్నారా?

సత్యం.– (కొంచెం తగ్గి) నేనే వెళతాను. మీారు విశ్రాంతి తీసుకోండి! హా! హా! హా! (నవ్వుతూ నిష్క్రమిస్తాడు)

స్వేచ్ఛ.– (చటాలున కూర్చుండి పేపరు ముఖానికి అడ్డు వచ్చేలా పెట్టుకుని చదువుతూ వుంటుంది.)

కామ్రేడ్.– [ప్రవేశం. పేపరు చదువుతూవున్న స్వేచ్ఛను జూచి తన రెండవ ప్రియురాలు "మురి" అనుకొని] హల్లో! మురి! నిజంగా నేను చాలా లక్కీ–మేన్'' నిన్ను కలుసుకుంటానో! లేదో! అనుకున్నా. నా వుత్తరం అందిం దనుకుంటా? (అంటూ ఆమె ప్రక్కగా కూర్చుంటాడు)

స్వేచ్ఛ.– (పేపరుతీసి కోపంతో లేచి) ఆ! అందిందికనకే వచ్చాను.

కామ్రేడ్.– (ఆశ్చర్యంతో) నువ్వా?

స్వేచ్ఛ.– ఆ! నేనే! అప్పుడే మర్చిపోయావా?

కామ్రేడ్.– మర్చిపోవడం కాదు! విడచిపోయాను (అంటూ లేచి పోబోతాడు)

స్వేచ్ఛ.– ఆగు ? ... (అని అతనికి ముందుగా నిలబడును. రెండు చేతులతోటి కోటు కాలరు పట్టుకొని, ఒక్కసారి అతని ముఖంలోకిచూసి దీనంగా) కామ్రేడ్! ఇంతకాలం నాతో కాపురంచేసి, యిద్దరు పిల్లల్నికని, యిలా చెయ్యడానికి నీ మనసెలా ఒప్పింది ? పిల్లలైనా చూడవా ?

కామ్రేడ్.– పిల్లలకేం ? నువ్వేం పెంచాలా ? ప్రభుత్వం వుంది. పోతే ... నీ మాటా ? నీకేం! పాత జీవితం లోంచి క్రొత్త జీవితానికి వెళ్తావ్. ఇదొక ఆనందం! ఇలాటి సౌఖ్యంకోసమే పూర్వకాలంలో యజ్ఞాలుచేసి స్వర్గానికి పోయేవారు. అలాగే మనం విప్లవాన్ని తెచ్చి ఆ స్వర్గాన్ని యిక్కడికే తెచ్చాం. దీనికి తప్పే ముంది?

స్వేచ్ఛ.– అయితే, నన్ను మోసం చేస్తావా ?

కామ్రేడ్.– హా ! హా ! హా ! మోసం చేసింది నేనుకాదు. మీ ఆడవాళ్ల అందం. పువ్వులకు రంగెందుకో ? ఆడవాళ్ళకి అందం అందుకే! మీరు పుష్పాలైతే, మేం తుమ్మెద లవుతాం. ఇందులో మోసం లేదే!

స్వేచ్ఛ.– ఆ! అంతేనా ? (అని దుఃఖంతో ముఖంమీద చేయి పెట్టుకొని క్రింద కూలబడుతుంది)

కామ్రేడ్.– హా ! హా ! హా ! (నవ్వుకుంటూ ఆమెనుదాటి వచ్చినదారినే పోతాడు)

సత్యం.– (ప్రవేశం) హా ! హా ! హా ! (నవ్వుతూ) వెళ్లిపోయాడులే !

స్వేచ్ఛ.- (నెమ్మదిగా లేచి సత్యాన్ని క్రోధంగాచూచి బల్ల మీద పేపరు తీసుకొని) ఏం! మళ్ళా వచ్చావా?

సత్యం.- ఆ! నీకోసమే!

స్వేచ్ఛ.- ఛి! మీ మగాళ్ళని నాశనం చెయ్యాలి! (అని పేపరు సత్యంముఖాన కొట్టి చఱ్ఱున పోతుంది)

సత్యం.- హ! హ! హ! (అని నవ్వుతూ అక్కడవున్న ప్లాస్టిక్ బేగ్, పేపరుతీసి తానూ పోతాడు)

( తెరవాలును )

(౭-వ రంగం - అనుబంధము)

(సత్యం గౌరితో చెబుతూ వుండగా తెర ఎత్తబడును.

సత్యం.- అలా జరిగింది. అప్పటినుంచీ ఆమెనాకు కనుపించ లేదు. బహుశా! ఆమె నా ముఖం చూచివుంటే కొట్టేది కాదు.

గౌరి.- అబ్బ! చెప్పకండి! చెప్పకండి! (అని కష్టం సూచిస్తూ వెనుతిరుగుతుంది.)

సత్యం.- (నవ్వుచూ) ఎందుకలా బాధపడతావ్? ఇలా ఎంతమందో పాడయారు. ఇప్పుడేం చేస్తాం. లే! లే! గౌరీ! చాలా వేళైంది!

రైతు.- (వుత్సాహంతో) బాబూ! బాబూ! (అంటూ చేత్తో కరపత్రం పట్టుకొని వస్తాడు.)

సత్యం.— ఆ ! ఏం ? తాతా !

గౌరి.— ఏం ? తాతా !

రైతు.— పోయిందమ్మా ! పోయింది ? మన కష్టాలన్నీ పోయినయ్ ! రామరాజ్యం స్థాపించడానికి మహావీరుడు వస్తున్నాడు. యీ నిరంకుశ ప్రభుత్వం పోయి, ప్రజా సామ్యం వస్తాది.

సత్యం.— ఆ ! మహావీరుడా ? ఈతనని పట్టితెచ్చిన వారికి పది లక్షలూ, చంపి తెచ్చినవారికి ఇయిదు లక్షలూ యిస్తా మని ప్రభుత్వం ప్రకటించిందే !

రైతు.— ఈడి లచ్చలుమండ ? ఎవడికి కావాలి బాబూ ? కోటి రూపాయ లిస్తామన్నా సరే యీ దేశంలో అతన్ని పట్టేవా రెవరుబాబూ ? ఇతగాడి కిప్పుడు, దేశమంతా సైన్నమే ! ఇతగాడ్నే ప్రభుత్వం పడతాది ? ఇదిగో యీ పేపరు చదవండి !

సత్యం.— (తీసుకొని చదువుతాడు.)

గౌరి.— (తనూ ఆత్రుతగా చూస్తుంది.)

సత్యం.— (చదివి) ఆ ! రేపు యీ కొండలోయలో మీటింగా ? పన్నుల నిరాకరణ ! శాసనధిక్కారం !

విశ్వ.— (ఒక చీటీ చేత్తో పట్టుకొని పరుగెత్తుకొని వచ్చి) పెద్దోడా ! యీ చీటీ శేచ్చమ్మగోరిచ్చేరు.

గౌరి.— ఆ ! మా అక్క నీకు కనిపించిందా ?

విశ్వ.- ఆ ! ఆ యమ్మగారు ఎక్కడికో పోనాదు.

గౌరి.- ( ఆతృతతో ఆ చీటీ అందుకొని చదువుతుంది )
ప్రియమైన చెల్లీ,

నేను నీభర్తను చూచినప్పటి మొదలు నాలో గతించిన ఆవేదన పొంగి పొర్లింది. స్త్రీ జాతిని పతనంచేసిన యీ నిరంకుశ ప్రభుత్వాన్ని దిద్ది దేశానికి మేలు చెయ్యడానికి నిశ్చయించా. నా గురించి నీవు బెంగపెట్టుకోవద్దు. యీ అభాగ్యురాలు ఏమైనా ఫరవాలేదు. మీ రంపచూ మహా వీరునికి తోడ్పడతా. తదువాత సంగతులన్నీ మీకే తెలుస్తాయి.

ఇట్లు,

స్వేచ్ఛ.

గౌరి.- (ఆ వుత్తరం ముఖానవుంచి దుఃఖంతో) అక్కా ! (అని ఏడ్చును)

రైతు.- ఎందుకమ్మా ఏడుస్తావ్ ? ఆయమ్మ బలే ఆడది.

సత్యం.- (ఒక్కసారి తనలో ఏవో ఆలోచనలు రేకెత్తినటుల చూచి) తాతా ! ఇదే ప్రతిజ్ఞ చేస్తున్నాను ? ఆ మహా వీరుడికి కుడిభుజంగా వుండి, నిరంకుశ ప్రభుత్వాన్ని నాశనంజేసి ప్రజాస్వామ్యాన్ని స్థాపించడానికి నా చివరి ప్రాణం వున్నంతవరకూ పోరాడుతాను.

రైతు.- భేష్ ! రామరాజ్యానికీ జై! (అందరూ జై.)

రైతు.- ప్రజాసామ్యం !

(అందరూ) వర్ధిల్లాలి !

(అని అంటూ అందరూ నిష్క్రమిస్తారు)

---

౮-వ రంగము

ప్రభుత్వ కార్యాలయంలో ఒకగది. అందు డిక్టేటరు కూర్చునేందుకు ఒకకుర్చీ, దాని కెదురుగా అర్ధచంద్రాకారంలో వున్న టేబిలు, దానిచుట్టూ డిక్టేటరున కెదురుముఖంగా 4 కుర్చీలు అమర్చివుంటాయి.

డిక్టేటరు కుర్చీమీద కూర్చునివుంటాడు. ప్రక్కగా టెలిఫోన్, కాలింగ్ బెల్, ఒకపుస్తకం వుంటుంది. తెర ఎత్తగానే కూర్చున్న డిక్టేటరు రివాల్వరులో తూటాలను అమర్చుతూ ఉంటాడు. ఆ పని అయినతరువాత, రివాల్వరు జేబులోనుంచి, కాలింగ్ బెల్ మ్రోగించగానే

కామ్రేడ్.- (ప్రవేశం. శాల్యూట్ చేస్తాడు.)

డిక్టే.- సెక్రటరీ !

కామ్రేడ్.- సార్ !

డిక్టే.- మేధావు లేంచేస్తున్నారు ?

కామ్రేడ్.- సత్యాగ్రహం చేస్తున్నారు.

డిక్టే.- (క్రోధంగా) ! ఆ ... సత్యాగ్రహం... ! మాకు ఆగ్రహం కలిగించే సత్యాగ్రహాన్ని విరమించరా !

కామ్రేడ్.- ప్రయత్నించాను. లాభం లేకపోయింది.

డిక్టే.- ఆఖరుసారి నేప్రయత్నిస్తా, మేధావుల్ని తీసుకురా !

కా|మే.– (శాల్యూట్ చేసి వెళ్తాడు.)

డిక్టే.– (క్రోధంగా) సత్యాగ్రహం ...! ప్రజాస్వామ్యం! తిరుగుబాటు ... హా! హా! హా! ... హైడ్రోజన్– బాంబుల వర్షాన్ని కురిపించి సృష్టిని నాశనం చేస్తాను...

(ప్రవేశం సైంటిస్టు, కవి, పత్రికావిలేఖరి, ఆర్టిస్టు.)

డిక్టే.– మేధావంతులకు స్వాగతం? కూర్చోండి.

సైంటిస్టు.– చావు బ్రతుకులమధ్య స్వాగతాలెందుకు? ఈ యిచ్చే స్వాగతం ప్రజాస్వామ్యాని కిచ్చి ప్రపంచానికి శాంతి కూర్చండి.

డిక్టే.– ఆపండి? ... ఎంత మేధావంతులైనా ప్రభుత్వ ఆజ్ఞలకు బద్ధులుకావలసిందే! మిమ్ములను పిలిపించింది అందుకు కాదు. ప్రభుత్వ ఆజ్ఞను తెలియబర్చడానికి. ఎవరక్కడ?

కా|మే.– (ప్రవేశం) చేతితో కాగితం పట్టుకొని,

డిక్టే.– సెక్రటరీ! చదవండి శాసనాన్ని.

సెక్ర.– దేశంలోని మేధావంతు లందరికీ ... ప్రభుత్వంలో ప్రజా వ్యతిరేకత పెరిగిపోయింది. విప్లవజ్వాలలు కమ్ముకువస్తున్నాయ్. ఇప్పటిలో మనం ఏమరచివుంటే అధోగతి తప్పదు. సాటిలేని యీ సౌఖ్యాన్ని కాలతన్నుకొని బాధపడవలసి వస్తుంది. ప్రపంచం మేధావంతుల సొత్తు, సామాన్యుడు చాకిరీకి మాత్రమే పుట్టాడు. ఈ సత్యాన్ని ఆధారంగా తీసుకొని, ప్రజాప్రభుత్వాన్ని పడ

గొట్టాం. సామాన్య ప్రజానీకానికి శ్రమజీవుల నే పేరులో కన్నీరు తుడిచాం. ఎలాగై తేనేం వాళ్ళందర్నీ మన మేధాశక్తిచే మనం సృష్టించిన సంస్థలలో, కర్మాగారాలలో బంధించాం. శాసనాలచే చావగొట్టాం. పేరునకు ప్రభుత్వం శ్రమజీవులదైనా అనుభవించే సౌఖ్యాలు మేధావంతులవే. మొట్టమొదట మేధావంతుల సహాయమువల్లనే ప్రజాస్వామ్యమును పడగొట్టి నియంతృత్వాన్ని నెలకొల్పి మహదైశ్వర్యాలను పొంది ఎదురులేకుండా పరిపాలించాం. కాని నేడు నియంతృత్వానికి ప్రమాదం వాటిల్లింది. ఇంతపని ప్రజలు చేయగలుగుతున్నారంటే మేధావంతుల సహకారం లేనిదే జరగడం అసాధ్యం. ప్రజాస్వామ్యమే వస్తే మీ ఆధిక్యత అంతరిస్తుంది. మీరు అధోగతికి పోతారు. కాన పౌరబడి కుట్రదారులతో చేరి ప్రాణాల్ని పోగొట్టుకొనక ప్రభుత్వ ఆజ్ఞలమేరకు నడుచుకోవాలి ... అందుకు తప్పితే...

డిక్టే.– ఆగు!

సెక్రె.– (ఆగుతాడు.)

డిక్టే.– అందుకు మీరు తప్పరనుకుంటాను... !

కవి.– (లేచి) తప్పను.

డిక్టే.– భేష్

కవి.– నా విద్యుక్తధర్మాన్ని తప్పను.

డిక్టే.– ఆ! ... ఏది నీధర్మం?

కవి.— శాంతిని కాపాడడం మా ధర్మం ...

డిక్టే.— అందుకు ప్రభుత్వాన్ని సమర్థించడం మీ ధర్మం. కార్మిక, కర్షక, హృదయాలను వ్యామోహపరచే సాహిత్యంతో ప్రభుత్వాంకితం చెయ్యడం మీ ధర్మం!

కవి.— హు! అదా ధర్మం? ఆకటి మంటలలో అలమటించే ఆ రోజుల్లో అదే ధర్మం అని నమ్మాం. అంతకన్నా ధర్మం లేదన్నాం. అన్నం, బట్ట ఆధారం యిస్తారని నమ్మాం. అంతేగాని...ఆ నెపంతో అమాంతంగా అశేష ప్రజానీకాన్ని అణగద్రొక్కి పంజరంలో చిలకలకు మల్లే పెంచిన పరువు ప్రతిష్టలులేని హీనసజీవనాన్ని గ్రహించలేకపోయాం. కార్మికుల చెమటను వర్ణించాం, కష్టజీవుల కండలను వర్ణించాం. అంతేగాని వారి హృదయాలలోనుండే అంతరాత్మని గ్రహించలేకపోయాం. దాని బాధ తెలుసుకోనలేక అంధకారంలో పడిపోయాం. భౌతిక వాదంలోపడి ఆధ్యాత్మిక భావాన్ని అంతరింపజేసి అశేష ప్రజానీకాన్ని అంధకారంలో ముంచాం. నేను కవినికాను, వీళ్లెవరూ కవులుగారు. నరరూప రాక్షసులు, రాజకీయ రాక్షసులువదిలిన రాబందులు.

డిక్టే.— (గట్టిగా బల్లగుద్ది) నీచం! నీచాతినీచం! నీమాటలు పరమనీచం! చట్టానికి విరుద్ధం! ప్రభుత్వానికి ద్రోహం!

ఆర్టి.— (ఉద్రేకంగా) ద్రోహం! ... ద్రోహం! దేశానికీ, సంఘానికీ ద్రోహం! ...

(తెరవెనుక ప్రజానీకం ఒక్కుమ్మడిగా)

ద్రోహం! ద్రోహం!

డిక్టే.– సెక్రటరీ!... ఏమిటా గోల

సెక్ర.– (వెళ్ళి క్షణంలోవచ్చి) సార్! ప్రమాదం! ప్రమాదం! ప్రజాసమూహం! విప్లవం!

(కవి మొదలైనవారు : గట్టిగా విప్లవం వర్ధిల్లాలి)

డిక్టే.– (భయాందోళనలతో) ఆపండి! సెక్రటరీ!

సెక్ర.– సార్!

డిక్టే.– కళ్లుమూసుకున్నారా? ఎవరిచ్చారు స్వాతంత్రం! పోయి అడుగు! ఫో!

సెక్ర.– (పోయి తెరవెనుకనుంచి) చెప్పండి! శాసనాన్ని ధిక్కరించే యీ స్వేచ్ఛ మీ కెవరిచ్చారు?

ప్రజ.– స్వేచ్ఛ మా హృదయాల్లోంచి వచ్చింది. స్వేచ్ఛ మా జన్మహక్కు! స్వేచ్ఛ మా జన్మహక్కు!

(కవి మొదలైనవారు) స్వేచ్ఛ మా జన్మహక్కు!

డిక్టే.– సెక్రటరీ! ...

సెక్ర.– (వచ్చి) స్వేచ్ఛ వాళ్ల హృదయాల్లోంచి వచ్చిందట సార్!

డిక్టే.– ఆ! హృదయాల్లోంచా? వాళ్ల హృదయాలు ఇంకా చావలేదూ? ఇన్నాళ్ల పోలీసుప్రభుత్వంలో వాళ్ల హృదయాలు యింకా చావలేదు. ఆటంబాంబుల కోసం

ప్రయత్నించాం, హైడ్రోజన్ బాంబులకోసం ప్రయత్నించాం. కాని ఏం ప్రయోజనం? హృదయాన్ని నాశనంచేసే ఆయుధాన్ని ఒక్కటేనా ప్రయత్నించి సాధించలేక పోయాం...

( వెనుకనుంచి జనసమూహం )

(మాకు స్వేచ్ఛకావాలి! ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి!)

సెక్రె.– (భయంతో) అదిగో! హృదయాలు! విలయతాండవం చేస్తున్న హృదయాలు ... కవీ! నా మాటవిను, నాకు సహకరించు. నిన్ను ప్రెసిడెంటుని చేస్తా. నేను గుత్తకొన్న ఓట్లన్నీ నీకే యిప్పిస్తా. నా పార్టీ పాలసీకి విరుద్ధమైనా నేను బ్రతికుండగానే నిన్ను ప్రెసిడెంటునిచేస్తా. గానంచెయ్! మహాప్రస్థానాన్ని గానంచెయ్! కవీ! కవీ!

కవి.– చెయ్యను. చెయ్యలేను. మానవ మనస్తత్వాలను మసిపూసి మారడికాయ చెయ్యదలపెట్టే యీ మహాప్రస్థానాలు లక్షసార్లుపాడినా, హృదయాలకున్న సహజమైన స్వేచ్ఛను నాశనంచెయ్యలేవు. ఇంతకాలం నేను గానం చేస్తున్న మహాప్రస్థానాలు, వ్రాస్తున్న అభ్యుదయ కవనాలు, పవిత్రమైన హృదయాలకు సన్నిహితమైనవి కావు; నీచాతినీచమైనవి. ఇదికాదు కవనం! ఇదికాదు కర్తవ్యం! వీటిని విసర్జిస్తా! వీటిని నిరసిస్తా! ఆలపిస్తాను "ఓం" కారం! అనుసరిస్తాను అభ్యుదయమార్గం! అదే సన్మార్గం! సత్యమార్గం! సర్వోదయమార్గం!

డిక్టే.– ఆపు! ... ద్రోహీ! ... మాకే ద్రోహం తలపెట్టావ్ !

(జనసమూహం) మాకు స్వేచ్ఛ కావాలి! ... ప్రజాప్రభుత్వం కావాలి!

డిక్టే.– ఆ! అదిగో! విజృంభిస్తున్నాయ్! హృదయాలు విజృంభిస్తున్నాయ్! ... ఆర్టిస్ట్! నువ్వైనా నాకు సహకరించు... లలితకళలద్వారా వాళ్ల హృదయాలను మరలించు... ఆర్టిస్టు!...

ఆర్టి.– మరలించను... మరలించలేను. మానవ మనస్తత్వాలను అధర్మమార్గంలోకి మరలించలేను. ఆ నాటి పేదల ఆర్చుకుపోయిన శరీరాలను చిత్రించాను. కత్తులపై నడిచేవారిని, కాగడాలుపట్టేవారిని, కన్నీరు కార్చేవారిని చిత్రించాను. కాని, వాళ్ళలోవున్న ఆశాజ్యోతిని, స్వాతంత్ర్యజ్యోతిని చిత్రించ లేకపోయాను. "మీరు మానవులు, సర్వస్వతంత్రులు. మీ ఆత్మ అతీతమైనశక్తి గలది" అని చిత్రించలేకపోయాను. ఈనాటి మానిస జీవనాన్ని, నికృష్ట జీవనాన్ని వూహించలేకపోయాను. కాని యీనాడు తెలుసుకున్నాను. నా హృదయజ్యోతి బాగా వికశించింది. గత విధానాన్ని విసర్జిస్తాను; విస్మరిస్తాను. లోకశాంతికి దోహదమిస్తాను.

డిక్టే.– (గట్టిగా) ఆర్టిస్ట్!... ఏమిటి మాట్లాడుతున్నావ్? ఆ! ... ఆ! ... ఏమిటి మాట్లాడుతున్నావ్?

జనసమూహం.– లోకశాంతి కావాలి! స్వేచ్ఛ కావాలి!

సైన్టి.– (భయంతో) ఆ! ఆ! అదిగో! ... విలేఖరి! ... విలేఖరి! ...

విలేఖరి.– వద్దు. నా సహాయం కోరవద్దు. ఇప్పుడు నామాట ఎవ్వరూ నమ్మరు. నా ప్రకటనలకు విలువపోయింది. ఆనాటి పత్రికల్లో అంత లేసి అక్షరాలతో అమరజీవనంగా వర్ణించిన యీ విధానాన్ని యీనాడు ప్రజలు బాగా తెలుసుకున్నారు. మన ఇంటర్‌నేషనల్ బ్యూరో ప్రచారాలు స్వేచ్ఛాగాములైన ప్రజలు గుర్తించరు, నమ్మరు. నష్టం, నావల్ల కాదు, నే నేమీ చెయ్యలేను.

సైన్టి.– ఆ! మీరందరూ నాపై కుట్ర పన్నుతున్నారా? పన్నండి! మీకుట్రలు నన్నేం చెయ్యలేవు. ఈప్రపంచం సైంటిస్టులమీద ఆధారపడివుంది. మా రాజ్యాంగానికి వెన్నెముక, మాప్రభుత్వానికి జీవనాధారం ... అదిగో! అదిగో! అతడు! ... అతడే! ... సైంటిస్టు! నువ్వో క్కడివే, యీనూత్న నవనాగరికలోకానికి సృష్టికర్తవు. ఇదంతా నువ్వు సాధించిన ఘనవిజయం. అదిగో! ఆకాశంలోకి చొచ్చుకొన్న ఆపొగగొట్టాలు నీ ఘనవిజయాన్ని చాటే పతాకాలు. ఈనాటి రాజకీయవేత్తలు, ఆర్థిక వేత్తలు, మన స్తత్వ వేత్తలు, నీసృష్టివలయంలో పడి గిజుగిజ తిరుగుతున్నారు. వాళ్ళంతా నీచేతిలో కీలుబొమ్మలు. నీమూలంగా, లక్షోపలక్షల ప్రజాహృదయాలలోవున్న స్వేచ్ఛా జీవనాన్ని, ఫేక్టరీలనే పంజ

రాళ్లో పెట్టి బంధించాం. వాళ్ళందరి నెత్తిన రాజదండం పెట్టి పరిపాలించింది నీవల్లనే! ... చూడు శామ్యేల్స్! నువ్వొక్కడివే నాతో సహకరించు! వీళ్ళందరూ వట్టి దండగ.

సైంటి.— ఛీ! నన్నెందుకలా పొగుడుతావ్! ధనసౌభాగ్యాల వ్యామోహంలో పడి, విజ్ఞానాన్ని దురాశాపరులకు, దోపిడీగాండ్రకు అమ్ముకొన్న నీచుణ్ణి నేను. నన్ను గౌరవించకండి! మన్నించరాని తప్పిదాన్ని చేసిన మహా పాపిని! కోటానుకోట్ల ప్రజానీకాన్ని నాశనంచేసే మారణాయుధాల్ని కనిపెట్టిన మహా! హంతకుణ్ణి. సైంటిస్టునని చెప్పుకోడానికి సిగ్గేస్తోంది. ఏమని చెప్పుకోనేది? నేనేం చేశానని వుపకారం? యంత్రాలను సృష్టించాను...ఎవరికోసం?... ప్రజలకోసమా? కాదు. మీకోసం, మీవ్యాపారం కోసం, మీ ఆశలను తీర్చడం కోసం. వేలకొలదీ వున్న గృహపరిశ్రమలను నాశనం చేశాను. లక్షలాది ప్రజలను నిరుద్యోగులుగాచేసి యంత్రాలకు బానిసలను చేశాను. ఆయంత్రాలను పెట్టుబడిదార్లు, నియంతలు స్వాధీనం చేసుకొని, అశేష ప్రజానీకాన్ని వారి పాదాక్రాంతులను చేసుకోగలిగారు మావల్లనే! ... ఈవిధంగా దాని సజీవనానికి పునాది వేశాను... ఓ కార్మికుడు వుదయంలేస్తాడు. వాడి దృష్టిలో అఫీసు, ఫ్యాక్టరీ, యుద్ధాలు, రాజకీయాలు, ఇదే గొడవ. వాణ్ణిగురించి వాడు ఆలోచించుకోడానికి

తీరికేవుండదు. వాడు వాడ్ని మర్చిపోతాడు. ఇలాంటివాడు మానవుడేనా? మానవుడు చెయ్యవలసిన పనేనాయిది? ఇదేనామానవత్వం? ఈ ఘోర నైతిక పతనానికి కారకు లెవ్వరు? ... సైంటిస్టులు! ... నిజం చెబుతున్నా! ప్రపంచంలో మహా పాపాత్ము లెవరంటే ...? సైంటిస్టులు. మమ్మల్ని గౌరవిస్తావెందుకు? నీ తంత్రాలను భిన్నం చేస్తాం! నీ విధానాన్ని ఖండిస్తాం! సుస్థిర లోక శాంతి స్థాపిస్తాం!

ప్రజలు.— లోకశాంతి కలగాలి! నిరంకుశత్వం తొలగాలి!

డిక్టే.— ఆ! ... ఆపండి? (అని రివాల్వరుతీసి) స్వేచ్ఛ!... నీ స్వేచ్ఛకే శక్తివుంటే దీన్నెదిరించమను? ఏదీ నీ స్వేచ్ఛ? ఎక్కడుంది?

కవి.— హా! హా! హా! ఆత్మలోవుంది.

డిక్టే.— ఆ! ఆత్మ......! హా! హా! హా! స్వేచ్ఛ నడిగితే ఆత్మలో వుందన్నావు ... ఆ, ఆత్మ ఎక్కడున్నదో చెప్పు?

ప్రజలు.— స్వేచ్ఛ మా జన్మహక్కు! నిరంకుశత్వం నశించాలి!

కవి.— అదిగో! అశేషప్రజానీక కంఠకుహరాలనుంచి విజృంభిస్తున్నది. అదే ... ఆత్మ. నిరంకుశత్వాన్ని కూకటి వ్రేళ్ళతో కదిలించే బలవంతమైనది.

డిక్టే.— ఆ! ... ఆత్మ! ... అశేష ప్రజానీక కంఠకుహరాల నుంచి విజృంభిస్తున్నది! హా! హా! హా! హైడ్రోజను

బాంబుల వర్షాన్ని కురిపించి ... అశేష ప్రజానీక కంఠ కుహరాలను భస్మీపటలంచేసి, ఆ ఆత్మ ల్నిలోకంలోంచి నెట్టేస్తాను ... హా! హా! హా! ఆ మారణ మహాజ్వాల ల్లో భస్మం చేస్తా! నశించనీ! ... చావనీ ...! ఆ త్మే బలమైందో? అణ్వాస్త్రాలే బలమైనవో తెలుస్తుంది? ... హా! హా! హా! (అంటూ పెద్దగా నవ్వి రివ్వున వేరొక మార్గంగుండా పోతాడు)

సైంటి.– హా! హా! హా! పిచ్చివాడు ... ఆ ఆత్మలేందే బాంబులు పడలేవు. విమానాలు నడవలేవు. బుజ్జలు పనిచెయ్యలేవు. హా! హా! హా! పదండి? ఎవరి సహ కారంతో మీ డీబాంబుల్ని ప్రేల్చుతారో చూద్దాం? పదండి! త్వరగా పదండి. (అందరూ నిష్క్రమిస్తారు)

(తెరవాలును)

---

## 7-వ రంగము

హాలంతా చీకటిగానుండును. తెల్లని తెరపై ప్రజానీకం పరు గెత్తుచున్న ఛాయలు. కాగడాలతో తుపాకులతో కోలాహలంగా పరుగెత్తుతారు. మధ్యమధ్య తుపాకీప్రేలుళ్ళు, బాంబుల ధ్వని, విమానాలధ్వని, ట్రాక్టర్లధ్వని, అంతా మహాసంగ్రామంలా కనిపిస్తుంది.

నినాదాలు.– జై రామరాజ్యానికీ జై! సర్వోదయరాజ్యానికీ జై! ప్రజాస్వామ్యం వర్ధిల్లాలి! నిరంకుశత్వం నశించాలి! (అంటూ యీాదిగువ ప్రస్థానం పాడుతూ పోతూంటారు,

— ప్రస్థానం —

మహోపిధంగా, మనోహరంగా
మహీమండలం మార్చేద్దాం
పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి
పట్టణాల పొగరంతా అణచి
పల్లెటూళ్ళ పాదాల పడేద్దాం
జయ, జయ, జయ, జయ, జయధ్వానాలతో
ఘంటానాదం మోగిద్దాం
తంత్రిగాళ్ళ తల దునిమేద్దాం
అది గది గదిగో ప్రభుత్వ భవనాల్
అంతా పోదాం అక్కడికి
అందులోని అధికారం అంతా
పంచాయితులకు పంచేద్దాం॥

(యీ గేయం చిన్నధ్వనితో తెరవెనుక వినబడుచుండగా తెర ఎత్తబడును.)

డిక్కే.— (ఉద్రేకంగా శిరస్సునకు తలిగిన గాయంతో రక్తం కారుతూ వుండగా పెద్దగానవ్వుతూ ప్రవేశం. చెయ్యి ఎత్తి చూపుతూ) అదిగో! అభేద్యమైన ప్రాకారాల మధ్య అనంతలోకాన్ని నాశనంచేసే మృత్యుశిబిరం. అందులో నున్న హైడ్రోజన్ బాంబులను దిక్కులంతటా విరజిమ్మి నాకు లేని యీ లోకాన్ని, నన్ను కాదన్న యీ

ప్రజలని నాశనంచేస్తా! హా! హా! హా! (అంటూ పరుగెత్తపోగా!

( తెర వెనుకనుంచి సైంటిస్టు )

ప్రమాదం! దుష్టుడు! అతని ప్రయత్నాన్ని ఆపండి! కాల్చండి!

డిక్టే.— ఆ! ఇదిగో! ప్రజాసికం. (అంటూ ఆతృతగా వెను దిరిగి మరిఒకవైపుకు పోబోవును.)

స్వేచ్ఛ.— ఢాం! (అని రివాల్వరు పేల్చి తాను ప్రవేశించును.)

డిక్టే.— అబ్బ! ... (అని ఒకచేత్తో గాయాన్ని అదిమి, రెం డవ చేత తన రివాల్వరు తీసి స్వేచ్ఛనుకాల్చి తాను పడి పోవును.)

స్వేచ్ఛ.— (దెబ్బ చేత్తోపట్టుకొని నెమ్మదిగా క్రిందకు వ్రాలి మూల్గుచుండును.)

గౌరి.— (తెర వెనుకనుంచి) అక్కా! అక్కా! (అనిపిలచును)

స్వేచ్ఛ.— ఆ ధ్వనివిని ఆతృతతో మోకాళ్ళపై మూల్గుతూ లేవబోవును.

గౌరి.— (మరల) అక్కా! అక్కా! (అని అరచును)

స్వేచ్ఛ.— (మోకాళ్ళపై లేచి చేతులుజాచి) గౌరీ! (అని కేక వేయును.)

గౌరి.— అక్కా! (అని వచ్చి కౌగలించుకొనును)

(గౌరీ స్వేచ్ఛలు రోదనస్వరాలతో పరస్పరం కౌగలించుకొన్న తరువాత)

గౌరి.– అక్కా! నే నేంత చెప్పినా వినావు కావు (రక్తం చూసి) ఆ! ఎంత రక్తం! ఆడదాన్ని యింతగా కొట్టడానికి వాడికి చేతు లెలావచ్చాయ్!

స్వేచ్ఛ.– హు! అడవిమృగాల కొట్లాటకు అంతఃకరణ దయా వుంటుందా?

గౌరి.– అంతేనా?

స్వేచ్ఛ.– అవును. (చూపిస్తూ) అదిగో! చూడు! ఆ రాక్షసుడు మహిళాలోక మానమర్యాదలను మంటగలిపాడు. నన్ను, నాలాంటివారిని యెందరినో స్వేచ్ఛ, హక్కులు అనే పేరుతో నడివీథికి తెచ్చి స్త్రీ ప్రకృతిని, పవిత్రతని నాశనంచేశాడు. వాడిని పగబట్టాను. ఏనాటికైనా పగతీర్చుకుందామని ప్రతిన చేశాను, తీర్చుకున్నాను. కాల్చాను, మనసారా కాల్చాను ... అబ్బ! ఉ! ఊ! (బాధ నభినయించుతూ) ఇదిగో! గౌరీ! యీ రివాల్వరు విడిచిపెడుతున్నాను. ప్రాణంకూడా విడుస్తాను ...... కాని ... గౌరీ ...

గౌరి.– అక్కా! ... ఏమిటో చెప్పు! ... చెప్పు! ...

స్వేచ్ఛ.– హు! గౌరీ! నా గురించి చెప్పుకోవలసింది ఏమీ లేదు. నీ భర్త చాలా మంచివాడు. అతను దారిలోకి వచ్చాడు. ఇక నువ్వు ఏవద్భారత మహిళాలోకానికి ఆదర్శ రాలవు. తెలియజెయ్యి ... నా మాటలుగా నా అనుభవాన్ని తెలియజెయ్యి. ఆడది అంటే ఆదిశక్తి... పురాణాలు చెప్పింది నిజమని తెలియజెయ్యి. మగవాడు ఆ

శక్తిని తన స్వాధీనంలో వుంచుకొంటేనే... తను శక్తి వంతుడై ప్రపంచాన్ని పరిపాలించగలడు. లేకపోతే... ఆ శక్తికే వశమై, దాని తాకిడికి శిథిలమై కడకు నాశన మౌతాడని తెలియజెయ్యి ... గౌరీ! ఒక్క విషయం మీ బావ కనుపిస్తే... అంతిమ దశలో పవిత్ర మీ నామాంకురాలను పంచప్రాణాలకు తోడుగా తీసుకుపోయా నని తెలియజెయ్యి ... (మూల్గుతూ)

సుందరం ...... (అని ప్రాణాలువిడచును.)

గౌరి.– అక్కా! ... (అని మీదపడి యేడ్చును)

సత్యం.– పిల్లడిని ఎత్తుకొని ఆత్రుతగా వచ్చి చటాలున ఆగి) గౌరీ! (అని పిలుచును)

గౌరి.– (నెమ్మదిగా శిరస్సునెత్తి భాష్పధారలు కారుచుం డగా) అక్క ... అక్క (నెమ్మదిగా లేచుచూ) అక్క మరణించింది ... మా అక్కని ప్రపంచం పాడుచేసింది. ఎరకు ఆశించే చేపలా మా అక్క నాశనం అయింది. తనకు భర్తపైగల భక్తిని ... ఒక్కసారి బైటపెట్టి తన ప్రాణం విడిచింది. (అని విలపిస్తుంది)

( తెర వెనుకనుంచి )

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మాఽమృతంగమయ

( అనే ఉపనిషద్వాక్యం వినబడుతుంది. )

మహాపీరుడు.– (సుందరం – ప్రవేశం. పెరిగినగడ్డము, ముఖమున కుంకుమ, ఖద్దరు దుస్తులు, వలెవాట ఖండువా, చేత భగవద్గీతతో)

(అతని వెనుక, కార్మికుడు, కర్షకుడు, సైంటిస్టు, కవి, విలేఖరి, ఆర్టిస్టు వస్తారు.)

గౌరి, సత్యం.– మహాపీర్ !

మహా.– (గౌరినిచూసి) ఆదర్శమహిళ. నీ వంటి పతివ్రతలే యీలోకాన్ని కాపాడగలరు ... నాకు తెలుసును. ఆ మరణించిన స్త్రీ స్వేచ్ఛ.

గౌరి.– ఆ ! మీకెలా తెలుసు ? మహాపీర్ !

మహా.– ఒకప్పుడు నాభార్య.

గౌరి.– ఆ ! ... మీరా నేనా ?

సత్యం.– అన్నా ! ... (పిల్లల్ని దించి దగ్గరకు వెళ్తాడు)

మహా.– తమ్ముడా ! ... (అని రెండుచేతులూ పట్టుకొని) ఆమెకు స్వేచ్ఛకావాలంది పాపం ! అమాయకురాలు. మగవాడంటే యేమిటో తెలుసుకో లేకపోయింది. నేను వద్దన్నాను. నాదాంపత్యాన్ని త్యాగంచేశాను. కొంత కాలానికి ఆమెకు తెలిసొచ్చింది. పతితురాలైంది. సంఘంపై కత్తిదూసింది ... కాని యేంచెయ్యగలదు? అబల ! అబల ఎప్పుడూ అబలే ... వీధుల్లో తిరిగితేరాదు బలం, వుద్యోగాలు చేస్తేరాదు బలం, తుపాకీ పడితేరాదు బలం. అట్టి బలాబలాలు స్త్రీ, పురుషులకు ప్రకృతి యిచ్చిన

వరాలు. మధ్యనురావు, మధ్యనుపోవు. అది తెలుసుకో లేకపోయింది. అది చదువుకున్న ఆనాటి విశ్వవిద్యాలయాలలో యీసంగతే చెప్పేరుకాదు. ఎలాగైతేనేం. నశించింది.

సత్యం.– (క్రోధంతో) కాదు ... అది నశించడానికి కారణం అదికాదు. నీచు ... యీనీచుడు. ధనికవర్గపు దౌష్ట్యాలనుండి రక్షిస్తానని, పెట్టుబడిదారీ విధానం అంతరింపజేస్తానని ... అమాంతంగా తానేవో అధికారంతో కూడిన ధనికవర్గాన్ని యేర్పాటుజేశాడు. ఆనాటి పెట్టుబడి దారుల తలదన్నిన పెట్టుబడిదారై కూర్చున్నాడు. స్వదేశవుత్పత్తిని పెంచి, విదేశాలలో మార్కెట్టును సంపాదించడానికి, ఎన్నో అవినీతిపనులను చేశాడు. సామ్రాజ్యాలను నిరశించి. నిందించిన, యీ నీచుడు కుతంత్రాలు, కుటిలు పన్ని వలసవిధానం అవలంబించి, రాజ్యాలను బెదరించి అదిరించి, స్వాధీనం చేసుకున్నాడు. ప్రజను కార్మిక, కర్షక వర్గాలుగా విభజించి, మేధావంతులను మేతపడేసి, ప్రజల స్వేచ్ఛను నాశనంచేసిన దుష్టనియంత.

కర్ష.– ఇంతకన్నా ఘోరం ఇంకేం కావాలి బాబయ్యా? దున్నేవాడికే భూమిపై హక్కన్న యీ పెద్దమనిషి, మాచే వేలకొలది ఎకరాలభూమి దున్నించి, పండిన పంటంతా తీసుకుపోయ్యాడు. కట్టుకొయ్యనున్న ఎద్దులను

చూచినట్లుగా మనుష్యులను చూచాడు. రైతుని కూలీగా మార్చిన రాక్షసుడు బాబూ! వీడు.

కార్మి.— శ్రమించేవాడికిదే ఫలిత మన్నాడు. శాసనాలచే మనుష్యుల నొక్కాడు. ఎక్కువ పనిచేయించుకొని తక్కువజీతం యిచ్చాడు. అడిగితే కాల్చేసేవాడు. ట్రాక్టర్లచే మట్టించేవాడు. దేశద్రోహు లనేవాడు. ఆ రోజుల్లో అన్ని సమ్మెలు చేయించిన పెద్దమనిషి తన పాలనలో సమ్మెచేస్తే ద్రోహ మనేవాడు. మా స్వేచ్ఛను అపహరించి మమ్మ యంత్రాలకు దాసులను చేశాడు.

సైంటి.— అవును. ఆ మహాపాపానికి కారణం నేను. వాడి ధనానికి ఆశించి, పొగడ్తలకు పొంగిపోయి, వాడిచేతిలో కీలుబొమ్మనై విజ్ఞానాన్ని అమ్ముకున్నాను. యంత్ర యుగాన్ని స్థాపించాను. మానవ సహజమైన స్వేచ్ఛను, నైపుణ్యతను అంతరింపజేశాను. నియంతలకు బొమ్మ లిచ్చాను.

కవి.— అందుకు అనుగుణ్యమైన సాహిత్యాన్ని సృష్టించి, యంత్రయుగాన్ని సమర్థించాను. శ్రమజీవుల్ని పొగడ్ పొంగేసి పూర్తిగా భ్రష్టుల్ని చేశాను. కాని వీడి కుతం త్రాన్ని బయట పెట్టలేకపోయాను. ఈ మహానేరానికి నేనూ బాధ్యుడ్నే.

ఆర్టి.— నేనుకూడా ఓ పాతకుడ్నే ... పవిత్రమైన కళను అమ్ముకొని వీడి వలలో పడ్డాను.

శ్రే.— దీనికంతకూ నేనే కారణం. నేను ప్రకటించిన ప్రకటనలద్వారా ప్రజలు మోసపోయినారు, అంధకారంలోకి పోయినారు. వారితోపాటు నేనూ పత్రికా స్వాతంత్ర్యాన్ని కోల్పోయి అంధకారంలో పడ్డాను.

మహా.— సోదరులారా! ఆవేశాలకు లోనుకావద్దు. ఏ కాలంలోనైనా ప్రపంచంయొక్క బాగోగులకు మేధావులే కారణం. ఈ మేధావులే పూర్వకాలాలలో ప్రాబల్యాలను వహించేవారు. సామాన్యులు మేధావులచేతిలో కీలుబొమ్మలు. కాని, సృష్టిలో ఒక ధర్మం వుంది. అవి రెండు విధాలు. పశుధర్మం, మానవధర్మం. పశుధర్మం అంటే బలవంతుడు బలహీనుని భక్షించడం. మానవ ధర్మం అంటే బలవంతుడు బలహీనుని రక్షించడం. ఈ ధర్మరక్షణకే న్యాయం పుట్టబడింది. ఈ న్యాయం కొంతకాలంవరకూ నిలిచి తరువాత క్షీణింపజొచ్చింది. ఇందుకు కారణం లేకపోలేదు. అదే మనం తెలుసుకోవాలి. వినండి చెబుతా: ప్రకృతికన్నా గొప్పది అహంకారం. అహంకారంచేసే ప్రయత్నమల్లా సౌఖ్యం కోసమే. సౌఖ్యం రెండువిధాల లభ్యమౌతుంది. అర్థంవల్ల. మనస్సువల్ల. పోతే మానవుడు చేసిన పొరపాటు యీ సౌఖ్యాన్ని అర్థంవల్ల పొందజూడడమే. అర్థం పదార్థమయం. పదార్థం ప్రకృతిశక్తుల స్వాధీనంవల్ల లభిస్తుంది. కనుక ప్రకృతిశక్తులను స్వాధీన పరచుకుంటే పదార్థం, అర్థం, సౌఖ్యం కల్గుతాయని మానవుడు

ఒక సిద్ధాంతం చేసుకొని ప్రకృతిశక్తులను పదార్థంతో జతపరుపగానే పదార్థం వింత వింత రూపాలు ధరించి మానవుని ఆకర్షించింది. ప్రకృతి శక్తులు అపరిమితం, పదార్థం పరిమితం కావడంతో పదార్థ సేకరణకోసం పరస్పర కలహాలు రేగి మహా యుద్ధాలై సర్వనాశనానికి దారి తీశాయి. కావున మనం ఇకముందు చేసేదేమంటే, సౌఖ్యాన్ని కేవలం పదార్థంద్వారాగాక, మనస్సుద్వారా పొందేందుకు అనుగుణ్యమైన రాజ్యాంగ విధానాన్ని నిర్మించుకొని సాధ్యమైనంత తక్కువగా పదార్థాన్ని వాడుతూ, విజ్ఞాన వివేకాలనే మనోవ్యాపారాల ద్వారా ప్రకృతిశక్తులను స్వాధీనపరచుకొని సుఖిద్దాం.

సత్యం.– అట్టి విధానాన్ని తెల్పి మా కందరికీ దారిచూపండి.

మహా.– అట్టి విధానాన్ని నే క్రొత్తగా చూప నవసరం లేదు. తిరిగి వేదయుగాన్ని సృష్టించి, యంత్రయుగాన్ని విసర్జించాలి. లెండి! ఈరోజే శుభదినం. బ్రతుకుబాటలను కంటక రహితంగా చేసుకునేందుకు మహా శుభదినం. లెండి! లెండి!

అందరూ.– లెండి! లెండి! వేదయుగాన్ని ప్రతిష్ఠించండి. సర్వోదయరాజ్యాన్ని స్థాపించండి. ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించండి.

జై! మహావీరునకు జై!

మహా.– అదిగో! సర్వోదయ భానుడు. పదండి, ఆ అంధకారంనుండి వెలుగుబాటలోకి...

## లోకశాంతి

### — గేయం —

మహా.— శుభం! శుభం! బ్రతుకు శుభం
శుభం బ్రతుకు, శుభం! శుభం!
అన్నా వినుమీ సత్యం
మిన్నగు మహారహస్యం ॥శుభం॥

సంతృప్తే సహచరుడౌ
సత్యమ్మే సహాయమా
ప్రేమసుధా పూర్ణం
బ్రతుకే మహదానందం ॥శుభం॥

సత్యం.— సమసిపోవు యంత్రయుగం
స్వయంకృషే శరణౌను
కార్మికదాస్యం పోవును
కష్టేఫలి నిజం! నిజం! ॥శుభం॥

కవి.— ధనికతత్వ దౌర్జన్యం
తనంతదానే నశించు
దురాశలకు బహుదూరం
నిరాడంబరార్థికం ॥శుభం॥

సైంటి.— అన్నా! వినుమీలోకం
అంతా ఆధ్యాత్మికం
భౌతిక విజ్ఞానం కడు
ప్రమాదమోయ్! మహాంతమోయ్! ॥శుభం॥

కర్ష.— రాట్నం రాధాదేవి
మగ్గమ్మ మహాలక్ష్మి
నాగలి నాగేంద్రుడోయ్
నమ్మవోయి యీ సత్యం.

కార్మి.— కాలం దుర్వ్యయ పరచక
కాపాడేందుకు యంత్రం
అన్నిటికీ యంత్రమైతె
అరాచకం, వినాశనం

అంతా.— జై ! సర్వోదయానికి, రామరాజ్యానికి

( తెరవాలును )



దేశ కాల పరిస్థితులకు అనుగుణమైన నాటకం. రచన ఆంధ్రుల అభిమానాన్ని ఏనాడో చూరగొన్న వడ్డాదిది.

ఏ దేశంలోనైనా సరే నియంతృత్వ ప్రభుత్వం లోక శాంతి భంగకరం. ముఖ్యంగా భారతదేశం వంటి ఆధ్యాత్మిక దేశాలలోన అది వినాశకరం కూడా అవుతుంది. అందుకే ఎవరూ తెలిసిగాని, తెలియక గాని నియంతలను సృష్టించగూడదు. అటువంటి ప్రభుత్వాలను ఆహ్వానించగూడదు. కాదుగూడదని ఆహ్వానిస్తే ఎటువంటి కష్టాలు ఎదురవుతాయో, మానవత్వమూ నాగరికతా ఎలా ధ్వంసమవుతాయో ఈ నాటకంలో కండ్లకు కట్టేటట్లు చూపబడింది. ప్రజాస్వామ్యాన్ని అణచివేసే శక్తులు విజృంభిస్తున్న ఈ రోజులలో ప్రజా ప్రబోధానికి ఈనాటకం ఎంతైనా ఉపయోగపడుతుంది.

దీని రచయిత వడ్డాదిగారు. తమ లేఖినిని సర్వతోముఖంగా వినియోగించి అనేక నాటకాలనూ, రేడియో నాటికలనూ, గేయాలనూ రచించి పెద్దల మెప్పుపొందినవారు. ప్రస్తుతం చలనచిత్ర రంగంలో రచయితగా కళామతల్లికి సేవచేస్తున్నారు.

హిందూ ప్రెస్
మచిలీపట్టణము

మూల్యము
రు. 1-25